# ఓంకార రహస్యము

[ గాయత్రీ మంత్రార్థ వివరణము ]



సంకలనకర్త :

**శ్రీ గాయత్రీబాబా**



శ్రీ గాయత్రీ సాహిత్య విజ్ఞాన కేంద్రము

ఆర్యాపురం, మధ్యవీధి - రాజమండ్రి-4

వైశాఖ మాసము
1990

ప్రతులు : 1000

ముద్రణ :
లలితాంబికా ప్రింటర్స్
ఇన్నీసుపేట ఆంధ్రా బ్యాంకు వెనుక
సుబ్బారావువారి వీధి, రాజమండ్రి-1
ఫోన్ : 71079



వెల : 15-00

# కృతజ్ఞతాంజలి

శ్రీ వేదమాత గాయత్రీ కృపాకటాక్షమువలన యీ "ఓంకార రహస్యం" అను గ్రంథమును భక్తకోటికి అందజేయుచున్నాను. ప్రణవస్వరూపమయిన పరబ్రహ్మను, ఆశబ్ధబ్రహ్మను వేదములు యే అర్థమును చెపుతున్నాయో! తపస్సంపన్నులు, వేదమూర్తులు వారివారి జ్ఞానదృష్టి, యోగదృష్టులకు తెలిసిన ప్రణవార్థములు సేకరించి యీ గ్రంథములో పొందిపర్చితిమి.

యీ గ్రంథమునకు సహాయపడిన పరమాత్మస్వరూపులగు వారలకు శ్రీ వేమకోటి బ్రహ్మశ్రీ క్రిష్ణయాజి, పార్వతీపురం వార్కి, జమిడిపేట శ్రీ డోకి సత్యనారాయణ ప్రజాబంధువార్కి, సాలూరు అయ్యప్పభక్తులు శ్రీ గంటా వెంకట్రాజుగార్కి, ప్రూపులు చూచిన శ్రీ బులుసు సత్య సూర్య సుబ్రహ్మణ్యం, తెలుగు పండిట్‌వార్కి, లలితాంబికా ప్రింటర్స్‌వార్కి, బ్లాకులు అందముగా చేసిన గౌతమీ బ్లాకువర్క్స్‌వార్కి, ధనసహాయము చేసిన భక్తులు, ముఖ్యముగా హిందీలోనుండి తెలుగులోకి అనువదించిన చిత్తూరు వాస్తవ్యులు శ్రీ జి. రామదాసుగారు, హిందీ పండిట్ (రిటైర్డు), కొత్తకోట (పాకాల) వార్కి మరియు శ్రీ కైలాస మానససరోవర తీరవాసి శ్రీ స్వామి ప్రణవానంద వార్కి శ్రీ వేదమాత సర్వదా రక్షించుగాక!

ఇట్లు,

గాయత్రీబాబా

# ముందుమాట

ఆత్మస్వరూపులగు జ్ఞానులారా !

సంసారసాగరమున పడి తాపత్రయాగ్నిచే పరితపించు జనులను, జాతి మత భేదముల గణింపక స్త్రీలనియు, శూద్రులనియు నెంచక కేవలం జిజ్ఞాసను మాత్రము గైకొని ప్రణవ నినాదమను మేఘనాదమును ధ్వనింపజేసి జ్ఞానవృష్టిని వర్షించి ముక్తులను జేయుచున్న మా పితృదేవులు శ్రీ గాయత్రీబాబాగారు సారభూత మగు 'ఓంకార రహస్యము, గాయత్రీమంత్రార్థ ప్రణవమునుగూర్చి ఒక చిన్న పొత్తమును ముద్రించి జిజ్ఞాసులగువారలకు అందించిరి. ప్రణవమనే (ఓంకారమనే) ఉత్కృష్టమైన పరబ్రహ్మవాచకము. సచ్చిదానంద స్వరూపమునగు నిర్గుణ బ్రహ్మమును సులభముగా ఉపాసన చేయుటకు ఋషిపుంగవులచే సగుణాకారముగ గ్రహింప బడి తత్ప్రతీకముగ సర్వ శబ్దముల మూలమైన ఓంకారమును మహార్షులు ఏర్పాటు చేసిరి, శ్రీమద్భగవద్గీతలో ( "అక్షరాణాం అకారోఽస్మి అక్షరములలో "అ" కారమును నేను అనుటలో శ్రీకృష్ణభగవానుడు తన్ను అక్షరములకు మొట్టమొదటిది యగు 'అ' కారముతో పోల్చుకొన్నారు. ప్రపంచములోగల సర్వమతముల వారును ఇట్టి ఓంకారశబ్దమునే ఉపాసించుచున్నారు. ఆస్తికమత స్థులు, రామ, కృష్ణ. శివ, నారాయణ. త్రిపురసుందరి గాయత్రి యిత్యాది నామములతో జపించినను క్రైస్తవులు "ఓం తండ్రీ" సర్వలోకవాసీ, భగవంతుడా మమ్ము రక్షింపుము, అని ప్రార్థన

చేసినను, మహమ్మదీయులు ఖుదాలాయిలా హాయితిల్లా, అల్లా ఇత్యాది ప్రార్థనలు చేసినను సమస్త ప్రార్థనలకు అనగా శబ్దము లకు ఓంకారమే మూలకారణమైనందున సర్వజనులును సత్యజ్ఞానా నందలక్షణముగల యా పరబ్రహ్మనే ఆయా మతసాంప్రదాయ వాక్యములతో ప్రార్థన చేసిన వారలగుచున్నారు.

ఈ గ్రంథము ప్రణవశక్తిని గుఱించి ఎక్కువగా ప్రతి పాదించినందున 'ఓంకార ప్రభావము' అని నామధేయము చేయ బడెను. ఓంకారములోనే పుట్టి ఓంకారములోనే పెరిగి ఓంకారము లోనే లయించుచున్నట్టి సకల మతతత్త్వములున్ను అన్యోన్య రమ్యములై వర్తించుట కొఱకు గాయత్రీబాబా సంకలనము జిజ్ఞాసు లకు ఉపయోగపడునని నా భావన.

ఇట్లు,
జ్యోతిషరత్న
గ్రంధి సాయివరప్రసాద్

# ద్రవ్యసహాయ మొసంగిన దాతలు

శ్రీ నూలి వెంకటసోమరాజు, జమిందార్, పెనుగొండ

శ్రీ గంటా వెంకట్రాజుగారు, సాలూరు

శ్రీ సుతాపల్లి సోమేశ్వరరావుగారు, శ్రీమతి లక్ష్మి సాలూరు

శ్రీ గోకవరపు అప్పలరాజుగారు, విజయనగరం

శ్రీ గోకవరపు వెంకట్రాజుగారు, ,,

శ్రీ నూకల సుబ్బారావుగారు, స్టేట్ బ్యాంకు రాజమండ్రి

శ్రీ కొండపల్లి చిరంజీవిరావుగారు, రాజమండ్రి

శ్రీ ముప్పన భవరాజుగారు, ,,

శ్రీ పసుమర్తి నాగేశ్వరరావుగారు, డి. జి. యం. వైశ్యాబ్యాంకు, బెంగుళూరు

శ్రీ రెడ్డిబాబుగారు, లాయరు, పలాస

శ్రీ నాళం రామారావుగారు, నార్కెడిమిల్లి సుబ్రమణ్యంగారు లక్ష్మిఇంజనీరింగ్ కంపెనీ, రాజమండ్రి

శ్రీ నరాలశెట్టి హరిప్రసాదరావుగారు, C.T.O. రాజమండ్రి

శ్రీ అందవరపు గోవిందరావుగారు, పెదపాడు (శ్రీకాకుళం)

శ్రీ రెబ్బాప్రగడ వెంకట రాజేశ్వరరావుగారు, అడ్వకేట్, M.A.B L., కొవ్వూరు

శ్రీ పువ్వాడ కృష్ణాంజనేయులుగారు, D.M. వైశ్యా బ్యాంకు

శ్రీ నేతి గురుమూర్తిగారు, శ్రీమతి పార్వతిగారు, రాజమండ్రి

— ० —

# శ్రీ వేదమాత ప్రార్థన

ఓ పూజ్య గాయత్రీ! క్షమాపరిపూర్ణా! ప్రేమమయీ!
నీకు నమస్కృతులు! సాష్టాంగప్రణామములు!
నీవు సచ్చిదానందస్వరూపిణివి, సర్వాంతర్యామినివి.
సర్వశక్తిమయివి, సర్వజ్ఞురాలవు.
సర్వజీవి హృదయాంతర్వాసివి.
కరుణార్ద్రహృదయము. సమదృష్టి, స్థిరమనస్సు.
భక్తి విశ్వాస, జ్ఞానములు మాకు ప్రసాదింపుము.
ఆకర్షణ లణగద్రొక్కి చిత్తవృత్తుల నరికట్టుటకు.
మాకు వలయు అంతరాధ్యాత్మిక శక్తి నొసంగుము.
మా హృదయ ఫలకములను సద్గుణములతో నింపివేయుము.
కామ, క్రోధ, లోభ, ద్వేషముల బారినుండి మమ్ము తప్పింపుము.
ఈ సర్వనామ రూపములలో నిన్ను సేవింపనిమ్ము,
ఈ సర్వనామరూపములలో నిన్ను తిలకింపనిమ్ము.
నిన్ను సదా స్మరించుకొననిమ్ము
నీ లీలలు సదా గానము చేయనిమ్ము,
నీ నామము సదా మా పెదిమలపై నుండనిమ్ము,
నీలోమమ్ము సదా వసింపనిమ్ము, నీకన్న మాకు వేరేదిక్కు కలదా!
అభీష్టములిచ్చి రక్షించుము. రక్షించుము. రక్షించుము.
సర్వజగదుపకారముగా నూరేండ్లు మమ్ము బెంచుము.
ధర్మమునుండి మమ్ము జారిపోనీకుము.
నిన్ను దెలిసి వర్ణింపనేరను.

ఓం తత్సత్.

# విషయ సూచిక



— o —

వ్యవస్థాపకులు



శ్రీ గాయత్రీబాబా     శ్రీమతి రాణెమ్మగార్లు



(లేటు) శ్రీమతి చల్లగల్ల రామాయమ్మగారు

భర్త : పద్మశ్రీ సి. నరసింహంగారు

కుమారుడు : డా॥ సి. యన్. రావుగారు

కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్సు

విశాఖపట్నం - 3



బ్రహ్మశ్రీ వేమఃకోటి కృష్ణయాజిగారు



శివభక్తులు

"సర్వజన ప్రియబంధు"

శ్రీ డోకి సత్యనారాయణమూర్తిగారు

ఓం

మానవతామూర్తి

బహుముఖ ప్రజ్ఞాశాలి, స్నేహశీలి, సేవాశీలి, సాహిత్యబంధు,

దానశీలి, కళాప్రియ, ఎన్నోసంస్థలకు శాశ్వతసిద్ధి ఏర్పరచిన



కోకొనట్ మర్చంట్స్

## లయన్. బి. వి. రాధారమణగుప్తగారు

పాలకొల్లు. (ప॥ గో॥ జిల్లా.)



# ఓంకార రహస్యము



## ఓంకారోత్పత్తి

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" యనెడి దానిని ప్రతిపాదించెడి ఓంకార నాదంలో "ఓం" అనెడి అక్షరం చతుర్థా విభజింపబడి అకార, ఉకార, మకార, యర్థమాత్రలతో నొప్పుచు నాల్గు విధము లయ్యెను. వాటిలో నకారము లింగదక్షిణ భాగమునను, ఉకారము ఉత్తర భాగంబునను, వాటి మధ్యను, మకారంబును, లింగోపరి భాగకంబున నర్థమాత్రయగు నాదంబును ప్రజ్వరిల్ల సాగెను. ఆ పరమాక్షర మిట్లు విభజింప బడినను, బ్రహ్మ విష్ణువులు, దీని రహస్య మెరుంగరైరి. అపుడు వేదాత్మకముగ ప్రణవము మార్పు జెందెను, అదెట్లన, అకారము ఋగ్వేదముగను, ఉకారము యజు ర్వేదముగను, మకారము సామవేదముగను, నాదమథర్వ వేదము గను, గోచరింప జేసి తన స్వరూపమంతయు నేకాక్షరముగ క్లుప్తపరచి యుండెను. తాను సృష్టినై, పంచ బ్రహ్మమయుడై, సృష్టి స్థితిలయములకై బ్రహ్మవిష్ణు రుద్రులను సృష్టించెను, లింగాధోభాగంబున కారణ త్రయము లనెడు బీజములను సృజిం చెను. (అనగా స్థూల సూక్ష్మ కారణంబులు) చతుష్షష్టి కళలతో

గూడిన యణిమాద్యష్ట సిద్ధులను సృజించెను. వీటిచే దశదిశలు నిండి వ్యాపించి యుండెను. స్వార్థమునకై యజుర్వేదము దశ విధములుగ స్థాపించెను. అనగా క్రియలలో సత్వగుణము విష్ణువు, క్రియలలో నాదిక్రియ, లోకమందు స్థితి, త్రితత్వములలో విద్యా కళలో ప్రతిష్టాకళ, పంచబ్రహ్మలలో వామదేవుడు, లింగ మధ్య భాగంబున, త్రికారణములచే యోనిరూపము, యజుర్వేద మయమై ప్రాకృతైశ్వర్యము, సామర్ధ్యమునకై తపస్సు, నీ విధం బున దశధా విభజింపబడెను. గుణములలో తమోగుణ ప్రధాను డగు రుద్రుడు, క్రియలలో నాదిక్రియ, లోకములయందు సంహా రము చేయుటలో శివతత్వము కళలలో విద్యాకళ, పంచవక్త్రము లలో నఘోర ముఖము.

లింగభాగములలో పీఠము, త్రికరణములలో బీజరూపము. పౌరుషములలో నైశ్వర్యము. ఈ విధముగా జగత్తంతయు సామ వేదముచే వ్యాపించి యుండెను. అధర్వవేదమున యాత్మ యనగా, నైర్గుణ్యమని చెప్పబడెను. (దయ) మూర్తులలో సదాశివుడగు మహేశ్వరుడే శ్రేష్ఠుడు. క్రియలలో నిష్క్రియ శ్రేష్ఠము. పరమాత్ముడగు శివుడు భూతానుగ్రహ కారకుడు గాన జీవులను తరింపజేయుచుండెను. ఇతడు మనోవాగాతీతుడు. ఊర్ధ్వ లోకములపై మనోమోదకరమగు చంద్రలోకము, నటుపై కైలా సము కలదు. అందీశ్వరుడు మతోనిత్య స్థితుడై యుండును. అక్కడి నుండి తిరిగి రావలసినదేగాని, దానిపై నేలోకంబులు

లేవు. శాంత్యాది సకలకళాధిష్ఠానుడు, పంచబ్రహ్మమూర్తియు నగు సదా శివుని యావాహన చేసి యర్చించినచో నిష్కళుడై నను సకలుడుగ గోచరించును. ఇతడు నాదబిందు పరాశక్తుల కంటె నతీతుడు, తత్వాతీతుడు, తత్వరహితుడు. ఇతడు తన మాయచే సర్వకారణములను కల్పించుచుండెను. అనంతమైన శుద్ధికంటె పరమేశ్వరుకు పరుడై యుండెను. అనగా మంత్రాతీతుడు, సర్వవిద్యాధీశ్వరుడు, నితనికన్న పరమేదియు లేదు. ఇతడు సర్వమంత్ర స్వరూపుడు. శక్తిత్రయ సమన్వితుడు, పంచ వక్త్రుడు, దశభుజుడు, సకలనిష్కలుడు, నాదబిందువుల కంటె పరుడు. విశ్వాధీశుడు, సుషున్నకంటె పరుడు. బ్రహ్మరంధ్ర మందున్న సహస్రారాధీశ్వరుడు, శివతత్వముకన్న పరుడు, పరమ కారణుడు, నిష్కారణుడు, కారణములను సృజించినవాడు, ధ్యానము చేయదగినవాడు, ధ్యానగోచరుడు, నవ్యయుడు, పరమాకాశ మధ్యస్థుడు, పరమాత్ముడు, సర్వైశ్వర్య సంపన్నుడు, సర్వేశ్వరుడు, ననాద్యైశ్వర్యవంతుడు, అపారమైనవాడు, సర్వస్వతంత్రుడు, నిరస్తాతిశయుడు, స్థిరుడు, ఇతడు దశవిధంబులుగ నుండెనని అధర్వశృతి యందు చెప్పబడెను. విశ్వమంతయు వ్యాపించి యుండెననియుకూడ చెప్పబడెను. ఋగ్వేదమందు నేనే జాగ్రత్స్వరూపుడనియు, ఆత్మతత్వ స్వరూపుడనియు శివుడే చెప్పి యుండెను. స్వప్నావస్థను నేనే యని యజుర్వేదంబున చెప్ప బడెను. జ్ఞానవిద్యచే, నేనే భోగ్యాత్ముడనని కూడా చెప్పెను.

సామవేదమందు నాసుషుప్తియే తమోగుణమని చెప్పియుండెను. అధర్వవేదమందు తురీయుడను, తురీయాతీతుడను, షడధ్వాతీతుడును, నేనేయని చెప్పెను. అధ్యాత్మికమగు త్రితయము, శివవిద్యయని చెప్పబడెను. మోక్షపదము కోరువారు వేదములచే తెలిసికొందురు. అధ్యాతీతమగు తురీయ పదము మోక్షము నొసంగును. అధ్యాతీతుడై నిర్గుణపరబ్రహ్మను తెలిసికొనవలెను. దీనిని తెలుపుడు చేయునది నాదము. ఆ నాదమే నా స్వరూపమని చెప్పియుండెను. సకల వస్తువులు గుణప్రధానములై యుండును. గాన అట్టి గుణప్రధానుడు పరమేశ్వరుడని తెలిసికొనవలెను. వ్యస్తమగు జగత్తంతయు, నోంకార మయమని చెప్పబడెను. ఈ ఓంకారము, సకల పదార్థములకు వాచకమై యుండెను. ఓంకారము చేతనే జగత్తంతయు విస్తరింపు జేసితినని శివుడు చెప్పియుండెను. శివుడే ప్రణవము, ప్రణవమే శివుడు. వాచ్యవాచకములకు భేదములేనట్లు వీరలకు భేదము లేదు. రుద్రుడు చింతారహితుడని మనంబున యూహింపవలెను, ఈ ఓంకారమును జపించినచో పరమేశ్వరుని పొందకుండా వెనుకకురాడు. ఓంకారమందలి యకారము, ఆత్మ స్వరూపమగు బ్రహ్మయని బోధింపవలయును. ఓంకారమందలి ఉకారము విష్ణువుగను, మకారము రుద్రునిగను, భావింపవలెను. మహేశ్వరుని దక్షిణాంగమున బ్రహ్మ వామాంగమున విష్ణువనసి తెలిసికొనవలెను. అతని హృదయమునుండి నీల లోహితుడగు రుద్రుడు జనించెను. అతడే శివుడని తెలిసికొనవలెను. సృష్టికై బ్రహ్మను, పాలనకై

విష్ణువును నియమించి మీరు నిత్య సృష్టిస్థితుల చేయుచుండుడు. నేను సంహారకాలమున సంహారము చేయుచుందునని రుద్రుడు నుడివియుండెను. ఈ ముగ్గురు జగత్కారకులు. ఈ కారణ త్రయమునకు శివుడే పరమ కారణుడు, బ్రహ్మ విష్ణువు లిరువురు నీరహస్య మెరుంగక, కలహముచే కదనము చేయుచు, బద్ధవైరులై యుండిరి, వారికి జ్ఞానోపదేశము చేసి వారి కలహమును బాపుటకై వారిరువురు మధ్య లింగరూపుడై శివుడావిర్భవించెను. ఓంకారమే ఈశ్వరుడని యథర్వ వేదమందున్నదని నీకు చెప్పియుంటిని దీని నుండియె, యనేకవేల ఋక్కులు, సామంబులు బయలుదేరెను. వేదములన్నియు, స్వయముగా పరమేశ్వరుని ముఖము నుండి వెలువడినవి.

అతని నవియే యెరుంగవు. బ్రహ్మ విష్ణువుల యజ్ఞానాంధ కారమును తొలగించుటకై, పరమేశ్వరుడు లింగమై, తన చిహ్నమని చూపించి వారి యజ్ఞానమును తొలగించి, వేదమందు చెప్పినట్లుగ లింగమందు ముద్రితుడై కాన్పింప వారు శాంతిమనస్కులై జ్ఞానవంతులైరి. ఉత్పత్తిలయకారకుడు షడధ్వరూపుడు, షడధ్వాతీతుడు, పరంధాముడు, పరమపురుషుడు, నిరుత్తరుడు, తనకన్న పైవాడు లేనివాడు. నిష్కళబ్రహ్మ శివుడు. ఈశ్వరుడు ప్రపంచమందలి పశుపాశములను ఛేదించువాడు. ప్రభువు, యెచటను భయములేనివాడు. యెల్లప్పుడు వృద్ధి క్షయములు లేనివాడు, నవ్యయుడు, బాహ్యాంభ్యంతర వ్యాప్తుడు, బాహ్యాంభ్యంతర వర్జి

తుడు, నిరస్తాతిశయుడు, ప్రపంచాతీతుడు, లక్ష్యలక్షణ నిర్దేశ్యుడు అవాఙ్మన సగోచరుడు, ప్రకాశైకరసుడు, శాంతుడు, ప్రసన్నుడు స్తుతిపాత్రుడు, సర్వకళ్యాణనిలయుడు, శక్తిసహితుడునగు విరూపాక్షునిగాంచి, బ్రహ్మ విష్ణువు లిరువురు శిరమువంచి కృతాంజలిపుటులై యుండి, ఓ ప్రభూ మమ్ములను జ్ఞానాజ్ఞానులుగ నిర్మించితివి. మాకిట్టి భ్రాంతులు కల్గించితివి. నిన్ను మేమెట్లు తెలిసికొందుము. నీవు మా యెదుటనుండగ భ్రాంతులెక్కడివి ? నీ యెదుట నిర్భయముగ మాట్లాడువాడెవడు, మా వివాద మిప్పుడు శోభగ నుండెను. మా వివాద ఫలముచే నీ పాదాభివందనము లొందగల్గితిమి, నిన్ను స్తుతించుటకు మా వాక్కులందవు, నీ యెదుట తూష్ణీభావము నొందుటయే గాని, యేమియు చేయజాలము. ఇట్టి సంఘటన జరిగెనేమి ? నీ విష్టపడియే చేసితివా ? తెలియక పలికిన మా ప్రలాపములను మన్నింపుము, సకల కార్యములకు నీవే యధిపతివి. నీ మాయచే నిన్ను మరచియుంటిమి. మోహితులమై యిట్లు చేసితిమిగాన. మమ్ము మరల శాసింపుము, మేము మిక్కిలి భయపడి యుంటిమి. మమ్ము రక్షింపుము. ఈశ్వరా ! మే మపరాధము చేసి నిన్ను పరీక్షింప నెంచితిమి. మా భయమును పోగొట్టుము. ఓ మహాదేవా ! నీతిరస్కారమునకు మమ్ము క్షమింపుమని, మన్నింపుమని వారిరువురు ఈశ్వరుని ప్రార్థింప.

నీశ్వరుడు మందస్మిత వదనుడై వారల గాంచి ఓ వత్సలారా ! మీరు నామాయామోహితులై మీరే ప్రభువులని గర్వించి

పరస్పర బద్ధవైరులై యుద్ధపర్యంతము వివాదము చేయుచునే యుండిరి. మీవాదములచే ప్రజాసృష్టి నిలిచిపోయెను. మీరు దర్ప మోహితులై వివాదము లాడుచుండుటచే దానిని శాంతింపజేయు టకై, లీలచే నీలింగమం దావిర్భవించితిని. మీరు లజ్జను విడిచి వివాదములు మానుడు. మీరు విగతమత్సరులై మీమీ క్రియలు నిర్వర్తింపుడు. పూర్వము మీరు నా యాజ్ఞచే సర్వవిజ్ఞానులై యుండి, మీకు మహాశక్తులు కల్గుటకు పంచాక్షరీ మహారత్న ముపదేశించితిని. అది మీరిపుడు మరచితిరి. మరల మీ కుపదేశించె దను. నా యాజ్ఞచే జపింపుడు. నా యాజ్ఞ లేనిదే మీరు సృష్టి స్థితులు చేయలేరని పరమేశ్వరుడు వారిరువురకు జ్ఞానసహితమగు మంత్రరాజ ముపదేశించి, వారుభయులు పరమేశ్వరాజ్ఞచే మంత్ర రాజమును పొందిరి. మహార్థప్రదమగు నీమంత్రము, సకలకళలతో కూడియుండెను. అట్టి మంత్రమును పొంది యా దేవదేవునకు సాష్టాంగ నమస్కారముచేసి భయరహితులై స్థిమితులై యపరిమి తానందభరితులై యుండ, యింతలో నింద్రజాలమువలె నటనున్న లింగ మదృశ్యమయ్యెను. వారలదిగాంచి విస్మితులై యిదంతయు కలయా నిజమా యని యూహింపుచు స్నేహము భంగమైనదని చింతింపుచు జగద్వ్యాపారంబునకై వారివారి స్థానముల కేగిరి. ఆనాటినుండి, శక్రాది సర్వదేవతలు, ఋషులు, నరులు, నాగులు, స్త్రీలు, విధివిధానంబుగ లింగ ప్రతిష్ఠలు చేసి పూజించుచుండిరి.

— ० —

# ఓంకార ప్రణవార్థము

ఓ౩మ్, ఓమ్, ఓం దీనికి, ప్రణవ మనియు, ఓంకార మనియు, ఉద్గీథ మనియు, ఏకాక్షర మనియు, తారక మనియు, శబ్దబ్రహ్మ మనియు నామాంతరములు గలవు. ఓంకారము పర బ్రహ్మము యొక్క నామములన్నిటిలోను సర్వోత్కృష్టమైన నామము. తక్కుంగల నామములెల్ల దీనియం దంతర్గతములైనవి. "ఓం ఖం బ్రహ్మ॥" "అవతి రక్షతీత్యోమ్"; రక్షించుటచేత "ఓమ్"; "ఆకాశమివవ్యాపకత్వాత్ ఖమ్"; ఆకాశమువలె సర్వ వ్యాపకుఁ డగుటచేత "ఖమ్": "సర్వేభ్యో బృహత్త్వాద్బ్రహ్మ" అన్నిటికంటె గొప్పవాఁడగుటచే "బ్రహ్మము". కాన, ఓంకారము సర్వ వ్యాపకుఁ డయిన పరబ్రహ్మస్వరూపము. ఇక్కడ, ఓం కారము బ్రహ్మప్రాప్తికి రూఢియైనట్టియు, పూర్ణమైనట్టియు సాధనమని స్పష్టీకరించుటకే అది బ్రహ్మముతో అభేదముగ (తద్రూపముగ) చెప్పబడినది. ఏదేని ఒక సాధనమును రూఢి యైనదని చెప్పవలసి వచ్చినపుడు దానిని కేవలము సాధనమనియే చెప్పక సాధ్య వస్తువుతో నేకరూపముగ (తద్రూపముగ) చెప్పు నాచారము గలదు. దీనికి ఔపచారిక ధర్మమందురు. ఉదా:— ఆయుర్వృద్ధి యందు ఘృతము (నెయ్యి) ఉత్కృష్టమైన సాధన మని చెప్పుటకు "ఆయుర్వైఘృతమ్" "యథార్థముగ ఘృతము ఆయువే'' అని చెప్పఁబడినది. అట్లే యిక్కడ ఓంకారము బ్రహ్మమని చెప్పబడినది.

"పరంచాపరంచ బ్రహ్మయదోంకారమ్" ఓంకారము పరబ్రహ్మము అపరబ్రహ్మమును గూడనై యున్నది.

"సకృదుచ్చరతిమాత్ర ఊర్ధ్వమున్నామ యతిత్యోంకారః" అధర్వశిఖ. ఒక్కమారోంకారము నుచ్చరించిన మాత్రాన శ్రేష్ఠ గతిని (పరమపదమును) జేర్పించుటంబట్టి ఓంకారమనంబడును.

"ఓ మిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత। ఓ మితి హ్యు ద్గాయతి తస్యోపవ్యాఖ్యానమ్ ॥" ఛాందోగ్యోపనిషత్. "నక్షరతి నసంచలతి నవినశ్యతి ఇత్యక్షరం బ్రహ్మ; యం సామగాః ఉచ్చై ర్గాయంతి సః తం ఉద్గీథమ్, ఉద్గీథశబ్దవాచ్యమ్" చలింపనిదియు వినాశముఁజెందనిదియు నైనది. అక్షరాఖ్యమైన బ్రహ్మము. దేనిని సామగానముచేయువారు ఉచ్చస్వరముతో గానముచేయుచున్నారో అదే ఉద్గీథము లేక ఉద్గీథనామముగలది. సర్వరక్షకుఁడైన ఓం కారస్వరూపునే యుపాసింపవలెను. ఏలనన బ్రహ్మవిదులు ఓం కారమునే (సర్వవ్యాపకాది గుణయుక్తమైన బ్రహ్మమునే) ఉచ్చ స్వరముతో గానముచేయుచున్నారు.

"అథ ఖలు య ఉద్గీథః స ప్రణవో యః ప్రణవః స ఉద్గీథ ఇత్యసౌవా ఆదిత్య ఉద్గీథ ఏష ప్రణవ ఓ మితి హ్యేష స్వరన్నేతి॥" (ఛాందోగ్యోపనిషత్తు) సుప్రసిద్ధమగు(సామవేదుల యొక్క) ఉద్గీథమే ఋగ్వేదులయొక్క ప్రణవము లేక ఓంకారము. ఈ ప్రణవమే ఉద్గీథము. (అనగా ఇవి రెండును సమానార్థకములు) ఈ ఉద్గీథమే ఈ ప్రణవమే ఆదిత్యుఁడు. అనగా అవినాశియగు

అఖండేశ్వరుఁడు. ఏలనన ఇవి (ఉద్గీథప్రణవములు) ఓంకార వాచ్యుఁ డగు బ్రహ్మమును గానము చేయుచు వానితోనే సంబంధ మును గలిగియున్నవి.

"సర్వే వేదా యత్పద మామనన్తి పపాగ్ంసి సర్వాణిచ యద్వదన్తి। యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యో మిత్యేతత్ ॥" అన్ని వేదములును సమస్త ధర్మానుష్ఠానరూపతపశ్చరణమును, ఎవనిని చెప్పుచు గౌరవించు చున్నవో, ఎవనిని పొందగోరి బ్రహ్మచర్యవ్రతము నాచరించు చున్నారో అట్టి పరమపదమును నీకు సంగ్రహముగ చెప్పు చున్నాను. పరమేశ్వరునియొక్క అట్టి ఉత్తమనామమే ఓంకారము.

"ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్। యః ప్రయాతి త్యజ న్దేహం స యాతి పరమాంగతిమ్॥" ఓం అను ఏకాక్షరరూప బ్రహ్మము నుచ్చరించుచు నన్ను (ఆ పర బ్రహ్మమునే) స్మరించుచున్న వాడై యెవ్వఁడు శరీరమును వదలిపోవుచున్నాఁడో వాఁడుత్తమగతిని (మోక్షమును) పొందు చున్నాఁడు. "ఓంతత్సదితినిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః।" "ఓం" అనియు, "తత్" అనియు, "సత్" అనియు బ్రహ్మము యొక్కనామము మూడువిధములుగ చెప్పఁబడెను. "తస్మాదోమి త్యుదాహృత్య యజ్ఞ దాన దపః క్రియాః। ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్ ॥" కాన, బ్రహ్మవేత్తలయొక్క శాస్త్రో క్తములగు సమస్తమైన యజ్ఞములు, దానములు, తపస్సులు, క్రియలు నెల్లప్పుడును "ఓమ్" అని చెప్పి చేయఁబడుచున్నవి.

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం సరవత్తన్మయో భవేత్॥" (ముండకోపనిషత్తు) (పరమేశ్వరునియొక్క సర్వోత్తమనామమైన) ఓంకారము ధనుస్సు; ఆత్మయే బాణము. బ్రహ్మము, లేక పరమాత్మ దానికి లక్ష్య మని చెప్పఁబడుచున్నది. సావధానచిత్తముతో (ఈబాణముచే బ్రహ్మమను లక్ష్యమునుసూటిగ) కొట్టవలెను. శరమువలె (లక్ష్యమునం దైక్యమగునటుల ఆత్మ పరమాత్మయందు) తన్మయము కావలెను. (అనగా, ఓంకారోపాసనచేయుచు సాధకుఁడు ఆత్మను పరబ్రహ్మమునందు యోజనము చేయవలెను; సమాధిస్థుఁడు కావలెను).

"తస్యవాచకః ప్రణవః॥" పాతంజలియోగదర్శనం. ఆ యీశ్వరునకు "ప్రణవమే" (ఓంకారమే) నామధేయము. "తజ్జప స్తదర్థభావనమ్॥" ఓం కారమును జపించుటయు, దానియొక్క అర్థమును భావన చేయుటయు ఉపాసన యనఁబడును. "తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ॥" ఆ యీశ్వరుని జెప్పెడు ప్రణవముయొక్క జపమువలన చైతన్యస్వరూపుఁడైన పురుషుని యొక్క విఘ్నములు తొలఁగును; జ్ఞానము లభించును.

"ప్రణవః సర్వవేదేషు" వేదములయందు ప్రణవము పరమేశ్వరస్వరూపము.

"తైలధారావదచ్ఛిన్నం దీర్ఘం ఘంటానినాదవత్ । అప్లుతం ప్రసవస్యాంతం యస్తం వేద స వేదవిత్ ॥" తైలధారవలె నవిచ్ఛిన్నమైనట్టియు, ఘంటానాదమువలె దీర్ఘమైనట్టియు, ప్లుతముతో గూడి యుండునట్టియు, ప్రణవాంతము నందలి నాదము ఏది కలదో దానిని తెలిసికొనిన వాఁడు వేదవిదుఁడు.

"ఓ మితి బ్రహ్మ । ఓ మితీదగ్ం సర్వమ్ ।" (తైత్తిరీయ ఉపనిషత్తు) ఓంకారమే బ్రహ్మము; ఓంకారమే ఈ సమస్తమైనదియు.

"అవతేష్టిలోపశ్చ॥" అను పాణిని యొక్క ఉణాది సూత్రముచేత "అవ" ధాతువు నుండి "మన్" ప్రత్యయమగుచున్నది. "మన్" ప్రత్యయమునుండి "టి" లోపించి "అవ + మ్" అగుచున్నది. అప్పుడు "జ్వర త్వర స్రివ్య విమవాముపధాయాశ్చ॥" అను సూత్రముచే "అవ" అను దాని స్థానమున "ఊఠ్" ఆదేశమై "ఊ + మ" అగుచున్నది. అప్పుడు గుణమై "ఓమ్" శబ్దము సిద్ధమగుచున్నది. ఇది వైయాకరణాచార్యుఁడగు పాణిని మహర్షి యొక్క మతము. "ఓమభ్యాదానే॥" "ఓంశబ్దస్య ప్లుతఃస్యాదారమ్భే। ఓ౩మ్ అగ్నిమీళే పురోహితమ్ ।" మంత్రారంభమందు "ఓమ్" శబ్దము యొక్క ఉచ్చారణ ప్లుతము. ప్లుతము త్రైమాత్రికము. కాన "ఓ" తరువాత "౩" అంకె వ్రాయఁబడును; "ఓ౩మ్".

"అప్లృ" ధాతువునుండి "తస్మా దాపే దోంకారః సర్వమా ప్నోతీత్యర్థః॥" సర్వత్ర వ్యాపకమైనది ఓంకారము. కాన ఓంకారము పరబ్రహ్మ స్వరూపము. ఇది బ్రాహ్మణ గ్రంథకారుల మతము.

ఓంకారము రెండు ధాతువుల నుండియు ఒక ఉపసర్గ నుండియు సిద్ధమగుచున్నదని మాండూక్యాద్యుపనిషత్కారుల మతము. "అవ" ధాతువునుండి "అ", "ఉత్" అను ఉపసర్గ నుండి "ఉ", "మా" లేక "మీ" ధాతువునుండి "మి" కలసి "ఓమ్" అగుచున్నది.

"అకారం చాప్యుకారంచ మకారంచ ప్రజాపతిః। వేదత్రయాన్నిరదుహద్ భూర్భువః స్వరితీతిచ॥" ప్రజాపతి మూడు వేదముల నుండియు "అ" కార "ఉ" కార "మ" కారములు, "భూర్భువఃస్వః" అను మూడు వ్యాహృతులు అనునట్టి సారమును తీసెను. ఇది స్మృతికర్తల మతము.

"ప్రకృష్టో నవః ప్రణవః, పుష్కలస్తోత్ర మిత్యర్థః, ణు స్తుతా విధిధాతోః, యద్వా ప్రణౌతి ప్రస్తూయతే అనయా బ్రహ్మేతి ప్రణవః॥" పుష్కలమైనట్టి స్తోత్రము ప్రణవము; 'ణు' (= స్తుతిచేయు) ధాతువునుండి వచ్చిన నామవాచకము "నవః"; "ప్ర + నవః = ప్రణవః"; లేక దీనిచే బ్రహ్మము ప్రస్తుతింపఁబడుచున్నది గాన ఇది "ప్రణవ" మనఁబడుచున్నది.

"ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రణామయతీ త్యేతస్మాత్ప్రణవః । చతుర్థావస్థిత ఇతి సర్వదేవవేదయోనిః సర్వవాచ్య వస్తు ప్రణవాత్మకం॥" (అధర్వశిఖోపనిషత్.) సకల ప్రాణులను (ప్రపంచమునంతను) పరమాత్మయందుఁ జేర్పించుటం బట్టి ప్రణవ మనఁబడును, నాలుగుపాదములతో (అకార, ఉకార, మకార, అర్ధమాత్రలు నాదముతో) గూడి యుండుట వలన సకల దేవతలకును సకలవేదములకును యోనియై (కారణ స్థానమై) యున్నది. సర్వవాచ్యవస్తువులును (సర్వదేవతానామములును) ప్రణవాత్మకమగును.

"దేవా శ్చేతి సంధత్తాం సర్వేభ్యో దుఃఖభయేభ్యః సంతారయతీతి తారణా త్తారః॥" సకల దేవతలును ప్రణవ స్వరూపమే. సకల దుఃఖములనుండియు సకల భయముల నుండియు (సంసారము నుండి) తరింపజేయునది గావున తారణ మనంబడును. తారణము చేయుట వలన ఓంకారము తారకమనబడును.

పరమేశ్వరుని, అటులనే సర్వవస్తువులను మాటలలో సూచించుటకు "ధ్వని" లేక "శబ్ద" మే ఆధారమై యున్నది. అట్టి సర్వధ్వనులకును ఓంకార మాధారమున నున్నది. ఇందలి ప్రథమాక్షర మగు "అ" కారము ధ్వనులన్నిటికి మూలాధారమై కంఠమూలమునుండి వెలువడు చున్నది. "ఉ" కారము మధ్య భాగమైన మూర్ధస్థానము నుండి వచ్చుచున్నది. "మ్" కారము ధ్వనుల వరుసలో చివరిదై రెండు పెదవులయొక్క కలయికచేఁ

గలుగుచున్నది. దీనితో ధ్వని అంతమగుచున్నది. కాన, "ఓం" కారము ధ్వనిని గలుగజేయు అనగా శబ్దము నుత్పన్నము చేయు సాధనమునంతను, లేక. స్థానమునంతను (కంఠమూలము మొదలు కొని, పెదవుల చివర వరకును) ఆవరించి యున్నది. కాన, ఓం కారము శబ్దమునకు లేక ధ్వనికి జనని యని చెప్పవచ్చును. అందుచే ఓంకారమును శబ్దబ్రహ్మమని గూడ కొందఱు వ్యవహ రింతురు. "గిరామ స్మ్యేక మక్షరమ్" వాక్కులలో ఓంకారము పరబ్రహ్మ స్వరూపము.

ఈ ఓంకారము వేదములయొక్క సారభూతము. ఉపనిష త్తులు దీని మహిమను గానము చేయుచున్నవి. యోగాది శాస్త్రములు దీని నుపాసించుచున్నవి. బ్రాహ్మణ గ్రంథములును, స్మృతులును, భగవద్గీతలును దీనిని ప్రశంసించుచున్నవి. దీని కనేకార్థములు కలవు. ఉపాసకులు దీనిని జపించుచున్నారు. యోగులు దీని ననుసంధానము చేయుచున్నారు. శిశువు పుట్టగనే పూర్వజన్మ సంస్కారముచేత ప్రణవనాదమును చేయుచున్నాఁడు. పరమేశ్వరు నుపాసించుటకు అందఱునెట్లు జన్మతోనే హక్కు దారులో అటులనే పరమేశ్వర వాచకంబగు ప్రణవోపాసనకుగూడ అందరకును జన్మహక్కు కలదు. ప్రణవము మంత్రరాజముల లోనికెల్ల శిరోమణి. దీనినుపదిష్ట మార్గమున, యుక్తరీతిని, సార్థ ముగ జపించుచో, ధ్యానము చేయుచో, ఉపాసించుచో సర్వపాప ముల నుండి విముక్తుఁడై సాధకుఁడు మోక్షార్హుఁ డగుచున్నాఁడు.

సర్వజనులను ఈ మంత్రరాజములు (ఓంకారమును) జపించుట కును, ఉపాసించుటకును, ధ్యానించుటకును సమానార్హులే. కాన సంపూర్ణార్థమును దెలిసికొని దీని నుపాసించుట వలన గలుగు నమృతత్వమును అందఱు చూరగొందురు గాక. ప్రార్థనానంతర మందు క్రైస్తవు లుచ్చరించు "Amen" "ఆమెన్" అను ఇంగ్లీషు శబ్దమును, నమాజునకు చివర మహమ్మదీయు లుచ్చరించు "అమీన్" అను పార్సీ శబ్దమును వైదిక "ఓమ్" అను శబ్దము యొక్క అపభ్రంశ రూపములే (Corrupt forms). సూర్యో దయాత్పూర్వముననే లేచి మసీదులలో మహమ్మదీయులు "అల్లాహో అక్బర్...." అనుచు చివర ఉచ్చైస్స్వరముతో దీర్ఘ ముగ వేయు కేక ఓంకార నాదము యొక్క రూపాంతరమే. బ్రాహ్మీముహూర్తమున లేచి యోగులు చేయు ప్రణవ నాదము యొక్క అనుకరణమే మసీదులలో ఉదయముననే మహమ్మదీ యులు వేయు ఈ కేక. త్రివిష్టపదేశపు ( Tibetian ) బౌద్ధుల యొక్క "ఓంమణిపద్మేహూమ్" అను ప్రధాన మంత్రమునందు కూడ ఓంకారము ప్రధానస్థానము నలంకరించినది. "హృదయ కమ లము నందు ఓం రూపకమణి" అని యా మంత్రమున కర్థము.

ఆకార, ఉకార, మకారములను త్ర్యక్షర సంయోగముచే ఓంకారము సిద్ధమగుచున్నది. పరమేశ్వరునియొక్క అన్యనామము వలె గాక ఇది పరమేశ్వరుని వలెనే అవ్యయము, నాశరహితము, ఏకాక్షరము, లింగ-విభక్తి-వచనరహితము, సర్వగర్భము, అతి గంభీరము. సమస్త బ్రహ్మాండమును దీనియందిమిడి యున్నది.

ఈ ఓంకారము నందలి మూడక్షరములును జగత్తునందలి * సర్వ త్రిపుటులయొక్క సూచకములై యున్నవి.

## * సర్వత్రిపుటులు (త్రిసంఖ్యాకములు)

1. కార్యత్రయము :- సృష్టి, స్థితి, లయములు.
2. దేహత్రయము :- స్థూల, సూక్ష్మ, కారణములు.
3. అవస్థాత్రయము:- జాగృత్, స్వప్న, సుషుప్తులు.
4. తాపత్రయము:- ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములు.
5. సుఖత్రయము:- విషయానంద, వాసనానంద, బ్రహ్మానందములు.
6. ఆనందత్రయము:- మనుష్యానంద, దేవానంద, బ్రహ్మానందములు.
7. గుణత్రయము:- సత్వ, రజస్, తమస్సులు.
8. వృత్తిత్రయము:- శాంత, ఘోర, మూఢములు.
9. వ్యాహృతిత్రయము:- భూః, భువః, స్వః.
10. కాలత్రయము:- భూత. భవిష్యత్, వర్తమానములు.
11. లోకత్రయము :- స్వర్గ, మర్త్య, పాతాళములు.
12. లోకత్రియము:- పృథివీ, అంతరిక్ష, ద్యులోకములు.
13. మూర్తిత్రయము:- బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు.
14. దేవీత్రయము:- మహాసరస్వతి, మహాలక్ష్మి, మహాకాళీ.

15. దేవత్రయము:- వసు, రుద్ర, ఆదిత్యులు.
16. కర్తృత్రయము:- ప్రకృతి, జీవాత్మ, పరమాత్మలు.
17. మతత్రయము:- అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతములు.
18. కర్మత్రయము:- పుణ్య, పాప, మిశ్రమములు.
19. కర్మత్రయము:- ఆగామి, సంచిత, ప్రారబ్ధములు.
20. శక్తిత్రయము:- ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు.
21. శక్తిత్రయము:- పరమాత్మయొక్క జీవనధాత్రీ, దుఃఖాపహర్త్రీ, సుఖకర్త్రీ, శక్తులు.
22. వేదత్రయము:- ఋగ్యజుస్సామవేదములు.
23. కాండత్రయము:- జ్ఞాన, కర్మ, ఉపాసనలు (లేక,విజ్ఞానములు)
24. స్వరత్రయము:- ఉదాత్త, అనుదాత్త, స్వరితములు.
25. స్థానత్రయము:- నాభి. హృదయ, భ్రూమధ్యములు.
26. వైరాగ్యత్రయము:- ఐహిక ఆముష్మిక, మిశ్రములు.
27. భక్తిత్రయము:- బాహ్యా, అనన్య, ఏకాంతములు.
28. నేత్రత్రయము:- నేత్రద్వయము, జ్ఞాననేత్రము.
29. నేత్రత్రయము:- నేత్రద్వయము, భ్రూమధ్యము.
30. లక్ష్యత్రయము:- అంతర్, మధ్య. బాహ్యములు.
31. జ్ఞానత్రయము:- సంజ్ఞాన, విజ్ఞాన, ప్రజ్ఞానములు.
32. మండలత్రయము;- సూర్య, చంద్ర, అగ్నులు.
33. ముక్తిత్రయము:- జీవన్ముక్తి, విదేహాముక్తి. క్రమముక్తి.
34. ద్విజత్రయము- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు.
35. మౌనత్రయము:- వాఙ్మౌన, అక్షమౌన, కాష్ఠమౌనములు.

36. అగ్నిత్రయము:- దక్షిణ, గార్హపత్య, ఆహవనీయాగ్నులు.
37. ఋణత్రయము:- ఋషి, పితృ, దేవఋణములు.
38. ఈషణత్రయము:- దారేషణ, ధనేషణ, పుత్రేషణలు.
39. గురుత్రయము:- మాత, పిత, ఆచార్యులు.
40. తత్వత్రయము:- వాత, పిత్త, శ్లేష్మములు.
41. అవస్థాత్రయము:- బాల్య, యౌవన, వార్ధక్యములు.
42. నాడీత్రయము:- ఇడా, పింగళా, సుషుమ్నలు.
43. సూత్రత్రయము:- యజ్ఞోపవీతములోని మూడుముడులు.
44. త్రిపాదములు:- గాయత్రీమంత్రము నందలి 3 పాదములు.
45. దీక్షాత్రయము:- దృగ్దీక్ష (గురువు తనదృష్టిని శిష్యుని నేత్రముల యందుంచి దానిమూలమున వాని కల్మషమును తొలగించుట), వాగ్దీక్ష (ఉపదేశ రూపమున వాని మనస్సును నిర్మలము చేయుట), స్పర్శదీక్ష (హస్త స్పర్శము వలనఁ బరిశుద్ధుని జేయుట).
46. పాపత్రయము:- విహితకర్మ నాచరింపకుండుటవలన కలుగు పాపము, నిషిద్ధకర్మ చేయుటవలనఁ గలుగు పాపము, ఇంద్రియ నిగ్రహము లేకుండ కర్మ చేయుటవలనఁ గలుగుపాపము.
47. జ్ఞానత్రియము:- జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత.
48. ధ్యానత్రియము:- ధ్యానము, ధ్యేయము, ధ్యాత.

49. దృశ్యత్రయము:- దృక్, దృశ్య, ద్రష్టలు.

50. క్రైస్తవత్రిపుటి (Christian Trinity):- తండ్రి, కుమారుఁడు, పరిశుద్ధాత్మ (Father, Son and Holy Ghost). క్రైస్తవత్రిపుటి యొక్క భావము వైదిక మతమునుండియే గ్రహింపఁబడినది.

ఓంకారమువలె దాని యందలి యక్షర సంఖ్యయగు మూఁడు అంకె గూడ ఒక విచిత్ర సంఖ్య (Mystic number) అయి యున్నది. ఏలనన, ప్రణవము యొక్క స్పర్శలోనికి వచ్చిన మనుష్యులెల్లరును తెలిసియో తెలియకయో (జ్ఞాతముగనో అజ్ఞాతముగనో) ప్రణవోన్ముఖులైనటుల (పరమేశ్వరునితో ఎక్కువ సంబంధమును గలిగినవారైనటుల) ప్రణవములోని అక్షర సంఖ్యయగు "మూఁడు" యొక్క సంసర్గము గలిగిన ప్రతిసంఖ్యయు గూడ తద్భావభావిత మగుచున్నది. అనగా, మూఁడుచే ఏ సంఖ్యను గుణించినను సరే ఆ గుణింపగా వచ్చిన అంకె, లేక, అంకెల మొత్తము మూఁడు గాని మూఁడుచే సరిగా భాగింపబడు సంఖ్య గాని అయి యుండును. ఉదా:- $3 \times 7 = 21$; $2 + 1 = 3$ $5 \times 44 = 132$; $1 + 3 + 2 = 6 = 3 \times 2$; $3 \times 171 = 513$; $5 + 1 + 3 = 9 = 3 \times 3$, $3 \times 976 = 2928$; $2 + 9 + 2 + 8 = 21$; $2 + 1 = 3$. ఇత్యాది. ఈ ప్రకారముగ సమస్త సంఖ్యలును, సంఖ్యాశాస్త్రమునుగూడ ఓంకారాంతర్గతమై యున్నవి.

అనగా పరబ్రహ్మ స్వరూపమై యున్నవి. ఓంకారము నందు సమస్తజగత్తు నిమిడియున్నది. ఎటులన - "ఓ" అని మొట్ట మొదట నోటిని కొంచెము తెరచుచున్నాము. అనగా సృష్టికర్మ ప్రారంభమగుచున్నది; "ఓ" అని మరి కొంచెము దీర్ఘముగా నుచ్చరించుచు నోటి నట్లే కొంచెము సేపుంచుచున్నాము. అనగా స్థితికర్మ యగుచున్నది; ''మ్'' నుచ్చరించి నోటిని మూసివేయు చున్నాము. అనగా లయకర్మ యగుచున్నది. సృష్టిస్థితిలయము లిట్లు పిండమునందు క్షణకాలమున జరుగుచున్నవి. అటులనే మన కనేక సంవత్సరములలో జరుగుచున్నట్లు కాన్పించు సమస్త జగత్తు యొక్క సృష్టి స్థితిలయములు గూడ ఆ పరబ్రహ్మ పర మేశ్వరునియందు అతనియొక్క ఒక్క తృటికాలములో జరుగు చున్నవి. ఇట్లోంకారము సృష్టి స్థితిలయ సూచకమై దానికంటె అతీతమై యున్నది. కాన జగత్తంతయు ఓంకారమునం దిమిడి యున్నది. త్ర్యక్షరయుతమైన ప్రణవము త్రిగుణాత్మకమైన సమస్త జగత్తును దాని కర్తను గూడ సూచించుచున్నది. ఇఁక ఓంకారము యొక్క సంక్షిప్తార్థము క్రింద వివరింపఁబడును.

''అ'' కారమునకు విరాడగ్ని విశ్వాదులును: "ఉ'' కార మునకు హిరణ్యాగర్భ వాయుతైజసాదికములును; "మ" కారము నకు ఈశ్వరాదిత్య ప్రాజ్ఞాదికములును సూచకములు.



విరాట్ = [ఉపసర్గ పూర్వకమగు "రాజృదీప్తౌ" అనుధాతువుతో "క్విప్" ప్రత్యయము చేర్చుటచే "విరాట్" శబ్దము సిద్ధమగుచున్నది. "యోవివిధంనామ చరాచర జగద్రాజయతి ప్రకాశయతిసవిరాట్"] వివిధము, అనగా, బహుప్రకారమగు చరాచర జగత్తును ప్రకాశింపఁజేయువాఁడు, సర్వప్రకాశకుఁడు (All illuminating).

అగ్నిః = ["అఞ్చు గతిపూజనయోః, అగ, అగి, ఇణ్ గత్యర్థక" ధాతువు నుండి "అగ్ని" శబ్దము సిద్ధమగుచున్నది. "గతేస్త్రయోఽర్థాః జ్ఞానం గమనం ప్రాప్తిశ్చేతి, పూజనం నామ సత్కారః, యోఽఞ్చతి అచ్యతే గత్యంగత్యేతి సోఽయ మగ్నిః"] జ్ఞాన స్వరూపుఁడును సర్వజ్ఞుఁడును, తెలియఁబడుటకును, పొందుటకును, పూజింపఁబడుటకును యోగ్యుఁడును (All-knowledge; Omniscient).

విశ్వః = ["విశ్ ప్రవేశనే" అనుధాతువు నుండి "విశ్వ" శబ్దము సిద్ధముగుచున్నది. "విశన్తి ప్రవిష్టాని సర్వాణ్యాకాశాదీని భూతానియస్మిన్ యో వాఽఽకాశాదిషు భూతేషు ప్రవిష్టః స విశ్వ ఈశ్వరః"] ఎవ్వని యందు ఆకాశాది సమస్త భూతములు ప్రవేశించు చున్నవో (అనగా ఎవ్వనియందు సమస్త జగత్తుగలదో) మఱియు

నెవ్వఁడు సమస్త జగత్తునందును ప్రవేశించి (వ్యాపించి) యున్నాఁడో అట్టి పరబ్రహ్మము (One in Whom the whole universe dwells and Who per - vades the whole universe; Omnipresent).



హిరణ్యగర్భః = ["జ్యోతిర్వై హిరణ్యం తేజోవై హిరణ్య మిత్యైతరేయశతపథబ్రాహ్మణే. హిరణ్యాని సూర్యా దీని తేజాంసి గర్భే యస్య - తథా సూర్యాదీనాం తేజ సాం యో గర్భోఽధిష్ఠానం స హిరణ్య గర్భః"] ప్రకాశము నిచ్చునట్టి సూర్యాదిలోకములు గర్భమందుఁ (తనయందు) గలవాఁడు; మఱియు తేజోవంత మగు సూర్యాదిలోకముల నుత్పన్నము చేయువాఁడు (One Who is the source and support of all life and luminous bodies such as the sun).

వాయుః = ["వా గతిగంధనయోః" అను ధాతువు నుండి "వాయు" శబ్దము సిద్ధమగుచున్నది. "యో వాతి చరాచరం జగ ద్ధరతి బలినా బలిష్ఠః స వాయుః") చరాచరమైన సమస్త జగత్తును ధరించి జీవింపఁజేసి లయింపఁజేయువాఁడును, బలవంతులకంటె బలవంతుఁ డును, అనగా, అనంతబలయుక్తుఁడును (All power-ful; Omnipotent).

తైజసః = ("తిజ నిశానే" అను ధాతువు నుండి "తేజః" శబ్ద మును, దానిని తద్ధితాంతముచేయుటచే "తైజస" శబ్ద మును సిద్ధమగుచున్నవి.) ప్రకాశస్వరూపుడును, సర్వ జగత్ప్రకాశకుడును, అనగా, స్వయం ప్రకాశస్వరూపు డగు పరమాత్మ (One Who is self illuminating and resplendent and Who illumines even the luminous bodies).

౮౦

ఈశ్వరః = ("ఈశ ఐశ్వర్యే" అను ధాతువునుండి "ఈశ్వర" శబ్దము సిద్ధమగుచున్నది. "య ఈష్టే సర్వైశ్వర్యవాన్ వర్తతే స ఈశ్వరః") సర్వైశ్వర్య యుక్తుడు. అనగా సర్వశక్తిమంతుడును అనంతజ్ఞానయుక్తుడును స్వామియ (Lord ; One Whose knowledge and power are infinite).

ఆదిత్యః = ("దా అవఖండనే" అను ధాతువు నుండి "అదితి" శబ్దమును, దానిని తద్ధితాంతము చేయుటచే "ఆదిత్య" శబ్దమును సిద్ధమగుచున్నవి. "నవిద్యతే వినాశో యస్య సోఽయమదితిః, అదితిరేవ ఆదిత్యః) వినాశము లేని వాడు; నాశరహితుడు: మృత్యువు లేని వాడు (Immortal).

ప్రాజ్ఞః = ("ప్ర" పూర్వకమగు "జ్ఞాఅవబోధనే" అను ధాతువు నుండి 'ప్రజ్ఞ' శబ్దమును, దానిని తద్ధితాంతము చేయుటచే "ప్రాజ్ఞ" శబ్దమును సిద్ధమగుచున్నవి. "యః ప్రకృష్టతయా చరాచరస్య జగతో వ్యవహారం జానాతి స ప్రజ్ఞః ప్రజ్ఞ ఏవ ప్రాజ్ఞః") ప్రకృష్టమైన (విశిష్టమైన) జ్ఞానము కలవాడు, జ్ఞాన స్వరూపుడు సర్వచరాచరజగత్తు యొక్క వ్యవహారముల నెరిఁగినవాఁడు, సర్వజ్ఞుఁడునగు పరమేశ్వరుఁడు (One Who knows the actions of all the movable and immovable creatures of the whole world; All - knowledge; Omniscient.)

ఇది ఓంకారము యొక్క సంక్షిప్తార్థము.

# ఓంకార రహస్యము - వేదవాణి

శ్లో॥ ఓమ్ వాయురనిలమ మృతమథేదం భస్మాన్తం శరీరమ్ ।
ఓమ్ క్రతో స్మర । క్లిబే స్మర కృతం స్మర ॥
(యజు 4-15)

ఈ సమయమున చరించుచున్న ప్రాణవాయువు అమృతరూపమగు వాయువుగా పరిణతినందుగాత. శరీరం అగ్నిలో హుతమై భస్మరూపమగుగాత. ప్రాణస్వరూపుడవైన ఓ బ్రహ్మ!

నేను నాచే ఆచరించబడిన కర్మలను స్మరించుచూ లోకాధిభోగము లను కోరుకొనుచున్నాను.

వేదభగవంతుని పై వచనము ఎంతగానో సార్థకము. సార గర్భితముగా ఉన్నది. మనుష్యుని పుట్టుకనుండి మరణానంతరం వరకు గల అన్నికర్మలు, అన్ని భావనలు ఇందు యిమిడి ఉన్నవి. 'భస్మాన్తం ఓం శరీరమ్' వలన మరణ పర్యంతం ప్రణవజపం, ప్రణవస్మరణం, చేయుచుండవలసిందే. అందువలన ఈ లోక మున సర్వవిధ భోగములు కలిగి మరణానంతరమున మోక్షసిద్ధి కలుగనగును.

వేదములందు ఓంకారము ప్రత్యక్షసారభూతరూపము కలిగి ఉన్నది. వేదాధ్యయనపరులే ఈ విషయం గ్రహించిన వారుగా ఉంటారు.

— అనుసారం మనుస్మృతి (2-76)

శ్లో॥ 'అకారం చాప్యుకారం చ మకారం చ ప్రజాపతిః ।
వేదత్రయాన్ని రహాద్ భూర్భువః స్వరతీతి చ ॥

—బ్రహ్మ అకార, ఉకార, మకార స్వరూపమగు ప్రణవమును, భూః, భువః, స్వః రూపమైన త్రివిధ వ్యాహృతు లను వేదములనుండే నిర్ణీత మొనర్చెను.

వృద్ధహారీతి స్మృతి (1-88) అనుసారముగను ఓంకారమే వేదోత్పత్తిదాయినిగా ఉన్నది.

ఎట్లన—

శ్లో॥ సర్వేషామేవ మన్త్రాణాం కారణం ప్రణవస్మృతః ।
తస్మాత్ వ్యాహృతయో జాతాస్తాభ్యో వేదత్రయం తథా ॥

సర్వమంత్రములకు ప్రణవమే కారణమని చెప్పబడినది. దానినుండియే త్రివిధ వ్యాహృతులు, వ్యాహృతులనుండి వేద త్రయము ఉద్భవించెను.

ప్రణవము మరియు బ్రహ్మముల ఏకత్వము :—

గాయత్రి ఆదిలో ఓంకారము కలిగి ఉన్నది. అది స్వతః బ్రహ్మవాచకమే. ఆచార్యులైనవారు ఓంకారము, బ్రహ్మము అభేదమని ప్రతిపాదించి యున్నారు. అ-ఉ-మ-ల సంపుటితో 'ఓం' కలుగుచున్నది, 'అ' భారతీయ వర్ణమాలలోని ప్రథమాక్షరము. ప్రథమ స్వరము. కాన దీనిని సర్వప్రథమ పురుషుడు అనగా బ్రహ్మవాచ్యమనియు అంగీకరించి యున్నారు.

గాయత్రీమంత్రము 'భూః' సంజ్ఞకమగు వ్యాహృతితో ఆరంభమగు చున్నది. ఇందుచే ఆదిదగు 'భూః'కు పూర్వం అనాదియైన ఓంకారము కలసి ఉన్నది. ఇట్లు గాయత్రీ మంత్రమును అనాదియగుచున్నది. కానిచో మరోవిధముగా యిట్లనవచ్చును. వ్యాహృతికి ముందు చేరియున్న ఓంకారము గాయత్రీమంత్రమును సనాతనమైనదిగా చేయుచున్నది.

'ఉ' ఓంకారపు ద్వితీయాక్షరము భారతీయ వర్ణమాలందు యిది ఐదవ స్వరము. విద్వాంసులు దీనిని విశ్వాసంబంధమైన

ఐదవశక్తిగా అంగీకరించి ఉన్నారు. బహుసంఖ్యాకులగు ఆచార్యులు దీనికి వాయువు, తేజస్సు, చిత్శక్తి, అని కూడ అర్థము. చెప్పుచున్నారు, ఇది తేజోమయ పదార్థము లన్నింటికిని ఆశ్రయమై ఉన్న కారణమున హిరణ్యాక్షునిగ గూడ ఉన్నది. ఈ విధముగ దీనిలో వాయువు, అగ్ని, సూర్యుడు, ప్రజాపతి బ్రహ్మ, శివుడును సమావేశమై ఉన్నారు.

తృతీయాక్షరము 'మ' కు ఆనందము. ఆదిత్యుడు, ప్రాజ్ఞుడని అర్థములు. ఇది బుద్ధికి ప్రేరణకలిగించునది. ఈశ్వరీయ జ్ఞాన ప్రదాయిని. సర్వ శుభముల నొసగునది. సాధకుని కోర్కెలను సఫలీకృత మొనర్చు సామర్థ్యం కలిగి ఉన్నందున ఈశుడు, ఈశ్వరుడు, ఈశానుడు. శివుడనియును చెప్పుచున్నారు.

## సర్వదేవాత్మకమగు ప్రణవము

ఈ విధమున ఓంకారమునగల సమన్విత అక్షరత్రయము అపూర్వ శక్తిభరితము. ఇందు సర్వదేవతలును చేరియున్నారు. ప్రణవోపనిషత్తు ఈ రహస్యమునే యిట్లు నుడువుచున్నది —

శ్లో॥ తత్ర దేవాస్త్రయః ప్రోక్తా లోకా వేదాస్త్రయయోఽగ్నయః।
త్రిస్రో మాత్రార్థ మాత్రా చ ప్రత్యస్య శివస్యం తత్ ॥

—ఆ ఓంకారమున త్రిదేవతలు (బ్రహ్మ. విష్ణు, శివుడు) త్రిలోకములు, త్రివిధాగ్నులు, మాత్రాత్రియము, అర్థమాత్రి

స్వరూపముసూ ఉన్నవి. ఈ విధమున నిది ప్రత్యక్షమందున్న శివతత్వమై ఉన్నది.

నిరాకార బ్రహ్మదర్శనమునందు గొప్ప గొప్ప సాధువులు, యోగులు కూడ సాఫల్యత పొందలేకపోవుచున్నారు. అనేకజన్మల నుండి జేసిన సాధనకూడ అందుకు సహాయపడలేకున్నది. అట్లయి కూడ ఓంకారము మనస్సు, వాణి, అక్షర రూపముల ప్రత్యక్షముగ ఉన్నది. ఈ విషయముగా యాజ్ఞవల్క్యుల అభిప్రాయం యిది -

శ్లో॥ అదృష్ట విగ్రహోదేవో భావగ్రాహ్యో మనోమయః।
తస్యోంకారః స్మృతో నామ తేనాఽఽహూతః ప్రసీదతిః ॥

—ఇంద్రియములతో దర్శించుటకు సాధ్యముగాక, భావన వల్లనే గ్రహింపనగు మనోమయ ఓంకార స్వరూపుడై యున్న బ్రహ్మము 'ఓమ్' ద్వారా ఆహూతుడైనప్పుడే ప్రసన్నుడగు చున్నాడు.

## ప్రణవోపాఖ్యానము

ఛాందోగ్య ఉపనిషత్తునందు ప్రణవమును వ్యాఖ్యానించు సందర్భమున ఒక ఉపాఖ్యానము గలదు—

సాత్విక వృత్తిగల దేవతలు తామసీ వృత్తి స్వరూపమైన మృత్యువునకు భయభీతులై పరవిద్యా రూపమగు వేదత్రయమున ప్రవేశించి ఆ వేదత్రయముతో తమను ఆచ్ఛాదన మొనర్చుకొనిరి.

దీనివలననే దేవతలను ఆచ్ఛాదనజేసిన మంత్రములు, ఛందస్సులు అన్నియును ఆచ్ఛాదకములని పిలువబడసాగినవి.

చేపలు బట్టు జాలరి నీటగల మత్స్యములను కానగలిగినట్లే మృత్యువు ఆ దేవతలను ఋక్, యజు, సామ కర్మలయందు చూడగలిగెను. తమను మృత్యువు జూచిన విషయం దేవతలకు గూడ తెలియకపోలేదు. వారు ఋక్, యజు, సామ కర్మలనుండి వెలువడి 'స్వరం' అనగా ఓంకారమునందు ప్రవేశించిరి. ఇట్లు వారు వైదిక కర్మకాండను త్యజించి శుద్ధ బ్రహ్మోపాసనా ప్రవృత్తులైరి.

ఎవ్వరేని ఋగ్వేదపు ఋచా సంబంధమైన జ్ఞానార్జనము చేసినప్పుడు వారు తొలుత ప్రణవమునే ఉచ్ఛరించెదరు. ఇట్లే యజుర్వేదము. సామవేదములను గ్రహించిన సాధకుడును అత్యంత శ్రద్ధాస్వభావముతో ప్రణవోచ్చారణా ప్రవృత్తు డగుచున్నాడు. దీనివలన ఓంకార రూపమైన స్వరము బ్రహ్మమనియే స్పష్టమగుచున్నది. దేవతలు ఓంకార ప్రవిష్టులై అమరులు, అభయులైరి. ఇట్లే ఓంకారమును అమృతమని, అభయగుణ సంపన్నమని తలంచి దానిని ఉపాసించువారు దేవతల సమరూపమైన ప్రణవ బ్రహ్మమునజేరి మృత్యుభయరహితు లగుచున్నారు.

మహర్షి పతంజలి కూడ ప్రణవమును బ్రహ్మవాచకముగా స్వీకరించుచూ "యోగదర్శనమున" దాని మహిమను గూర్చి తెలియజేయుచూ నిట్లనిరి —

1. తస్య వాచకః ప్రణవః (1-27)

1. ఆ పరబ్రహ్మ వాచకమే ప్రణవము (ఓమ్)

2. తజ్జప స్తదర్థ భావనమ్ (1-28)

2. ప్రణవ జపము, దాని అర్థ చింతనవలన సమాధి స్థితి కలుగుచున్నది.

అనగా ఓంకార జపము, తత్సంబంధమైన అర్థ చింతనము ఒక్కటిగా కొనసాగవలసి ఉన్నది. ఇచ్చట ప్రణవము (ఓం) వాచకము కాగా ఈశ్వర శబ్దము దాని వాచ్యార్థముగా ఉన్నది. ఇట్లు భావ భరితమగు జపసాధన కొనసాగింపవలసి యున్నది.

3. తతః ప్రత్యక్ చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ (1-29)

3. ప్రత్యక్చేతనాధిగమము, అంతరాయాభావము - ఇవి రెండు ప్రణవ జపమునకు ఫలితముగా చెప్పబడినవి. ప్రత్యక్చేతనాధి గమానంతరం (తరువాత) కూడ అంతరాయము లొనగూడుచుండ నగును. గాన అంతరాయము నశించి అసంప్రజ్ఞాత నిరోధసిద్ధి కలుగునంతవరకు జపము చేయుచుండవలసినదేనని అర్థం.

అనువాదకుడు.

ప్రణవము ఈశ్వరవాచకమై ఉన్నది. కాన దానికి గల అర్థములను మననచేయుచూ జపసాధన కొనసాగింపవలెను. ఇట్లు చేయుటవలన అన్తఃకరణమునందున్న పరమాత్మయొక్క సాక్షా త్కారము కలుగును. అంతేకాక సాత్విక ఏకాగ్రతకు ఆటంక ముగా నున్న సర్వాంతరాయములను నశించిపోనగును.

"యోగదర్శనము" నందలి పై అభిప్రాయము "అథర్వ శిరోపనిషత్తు" కూడ సమర్థించుచూ—

శ్లో॥ ప్రాణాన్ సర్వాన్ పరమాత్మని ప్రాణామయతీత్తే
తస్మాత్ప్రణవః ।

—దేనియొక్క స్మరణ, ధ్యానాదులచే ప్రాణసంబంధమగు అన్ని వృత్తులును పరమాత్మయందు లీనమగుచున్నవో దేని కారణమున ఆత్మ విస్మృతి యుక్తమగు తన్మయావస్థ ఉత్పన్నమగుచున్నదో దానినే 'ప్రణవము' అనుచున్నారు.

తైత్తరీయోపనిషత్తునందలి "శీక్షావల్లి" లోని అష్టమ అనువాకమున గల ఓంకార వర్ణన మిట్లున్నది—

ఓమితి బ్రహ్మ । ఓమితీదగ్ం సర్వమ్ । ఓమిత్యే తదనుకృతిర్హస్మవా అప్యో శ్రావయేత్యా శ్రావయన్తి । ఓమితి సామాని గాయన్తి । ఓగ్ం శోమితి శస్త్రాణి శగ్ం శన్తి । ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి । ఓమితి బ్రహ్మ ప్రసౌతి । ఓమిత్యగ్నిహోత్ర మనుజానాతి । ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ బ్రహ్మోపా ప్నవానీతి । బ్రహ్మై వోపాప్నోతి ।

—ఓం బ్రహ్మము. అదే విశ్వము, అదే అనుకృతి. ఓ గురుదేవా ! ఓం -ను గూర్చి వివరించండి. ఓం తోనే సామగానము చేయుచున్నారు. "ఓం, ఓం' అని ఉచ్చరించుటతో శాస్త్ర పఠనము చేయబడుచున్నది. 'ఓం' తోనే అధ్వర్యుడు ప్రతిగర

మంత్రమును ప్రారంభించుచున్నాడు. ఓంకారోచ్చారణముతో బ్రహ్మ యజ్ఞమునకు అనుమతించుచున్నాడు. 'ఓం' అని అగ్ని హోత్రమునకు ఆదేశ మివ్వబడుచున్నది. అధ్యయన శీలియగు విద్వాంసుడు 'ఓం'ను ఉచ్చరించుచూ బ్రహ్మప్రాప్తిని గూర్చి వచించుచున్నాడు. 'ఓం' ప్రభావముననే బ్రహ్మప్రాప్తియును కలుగుచున్నది.

కఠోపనిషత్తునందు 'ఓం' ను గూర్చి బ్రహ్మలోకమును జేర్చునదిగా అంగీకరింపబడినది.

శ్లో॥ ఏతద్ధయేవాక్షరం బ్రహ్మ ఏతద్ధయేవాక్షరం పరమ్ ।
ఏతద్ధయేవాక్షరం జ్ఞాత్వాయో వదిచ్ఛతిం తస్య యత్ ॥
ఏతదాలమ్బనం శ్రేష్ఠమేతదాలమ్బనం పరమ్ ।
ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥

—ఇదే (ఓంకారము) అక్షరబ్రహ్మము. ఇదే పరబ్రహ్మము. కనుక ఈ అక్షరమును తెలుసుకొని ఏమి కోరితే అది ప్రాప్తించును. ఇదొక శ్రేష్ఠమైన ఆధారమై ఉన్నది. పరమాధారమును యిదే. ఈ అధారమును గ్రహించిన వ్యక్తి బ్రహ్మలోకమును పొందుచున్నాడు.

ముండకోపనిషత్తున బ్రహ్మప్రాప్తి నొనగూర్చు మహాన్ లక్ష్యసిద్ధికని గురువుద్వారా శిష్యునకు ప్రేరణ కలిగించబడినది—

శ్లో॥ ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం శరం హ్యుపాసాని
శితం సన్ధయీత
అమయ్య తద్భాగవతేన చేతసా లక్ష్యం తదేవాక్షరం
సోమ్యవిద్ధి ॥
ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన బేద్ధవ్యం శరవత్తన్మన్యో భవేత్ ॥

ఉపనిషద్ ప్రతిపాదితమైన ప్రణవరూపమగు ధనుస్సును బట్టి, దానిమీద తపస్సాధనలో తీక్షణమైన బాణము సంధించి అవినాశి యగు బ్రహ్మమును గురిపెట్టి కొట్టవలెను. ప్రణవము ధనుస్సు. ఆత్మ శరము, బ్రహ్మము దాని లక్ష్మము. ఆలస్య రహితుడైన మానవుడే దానిని కొట్టనగును. బాణముతో ఆ లక్ష్య భేదనం జేసి, దానియందే తన్మయానంద మొందవలెను.

ఈ విశ్వమే ఓంకారపు మహిమగా ఉన్నదని ప్రతిపాదించుచూ మాండుక్యోపనిషత్తు ఇట్లంటున్నది.

'ఓమిత్యే తదక్షరమిదం సర్వ తస్యోపవ్యాఖ్యానం భూత భవద్ భవిష్యదితి సర్వమోంకార ఏవం యచ్చాన్యత్ త్రికాలాతీత తద్ప్యోంకార ఏవం'

—ఈ ఓంకారము అవినాశమైన బ్రహ్మము. అసంపూర్ణ ప్రపంచము దాని మహిమను ప్రత్యక్షముగా కనబరచుచున్నది. భూత. భవిష్యత్, వర్తమాన (త్రికాలము లచే) ములతో కలసి

ఉన్న ఈ జగత్తు ఓంకారమే అయిఉండుటయేగాక త్రికాలాతీతమై యున్న ఏ తత్వము కలదో అదియును ఓంకారమే అయి ఉన్నది.

ప్రపంచములోని భోగము అథవా మోక్షప్రాప్తికి అనేకానేక సాధనలు శాస్త్రములందు నిర్దిష్టములు. కాని ఓంకార సాధకులైన వారికి అవన్నియును అనావశ్యకములు. ఎట్లన—ఓంకారం ఒక్కటియే సమస్తమైన కోర్కెలను నెరవేర్చు సామర్థ్యము కలిగి యున్నది.

ప్రశ్నోపనిషత్తు స్పష్టముగా చెప్పుచున్నది—

'తస్మై హోవాచ ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోంకారః । తస్మాద్ విద్వానేతేనైవాయతనేనైకతరమన్వేతి' (1)

స గద్యేకమాంత్రమభిధ్యాయేత స తేనేవ సవేదితస్తూర్ణమేవ జగత్యామభి సమ్పద్యతే। సమృచో మనుష్యలోక ముపనయన్తే సతత్ర తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా సమ్పన్నో మహిమాన మను భవతి' (2)

అథ యది ద్విమాత్రేణ మనసి సమ్పద్యతేసోఽన్తరిక్షం భూాయపునరావర్తతే (3)

యః పునరేతం త్రిమాత్రేణో సిత్యేతైనైవాక్షరేణ పరం పురుషమభిధ్యాతీత స తేజసి సూర్యే సమ్పన్నః। యథా పాదో

దర స్త్వచా వినిర్ముచ్యత ఏవం హవై స పాప్మనా వినిర్ముక్తః స సామభిరున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మాజ్జీవఘనా త్పరా త్పరం పురిశయం పురుషమాక్షతే (4)

మహర్షి పిప్పలాద్యులు వచించిరి—

హే సత్యకామ ! ఇదియే పరబ్రహ్మము. ఇది అపర బ్రహ్మముకూడ. ఇట్లు తెలియగలిగిన సాధకుడు ఒకే ప్రయత్న మున బ్రహ్మముయొక్క ఒకరూపమును పొందగలుగుచున్నాడు. అతను ఓంకారమునందలి ఏకమాత్రకుగల రూపమునే ధ్యానించి నచో దానిద్వారా త్వరలో భూలోకమున జన్మించగలడు. ఋగ్వే దపు ఋక్‌లు అతనికి మనుష్యశరీరమును కలిగించును. బ్రహ్మ యుక్తుడై శ్రద్ధాసమన్వితుడైన సాధకుడు మహిమాన్వితు డగును. (2)

ఓంకారమునందలి ద్విమాత్రులను ధ్యానముజేసినచో చంద్ర లోకప్రాప్తి కలుగును. అతనిని యజుర్వేద మంత్రములు చంద్ర లోకమునకు జేర్చును, అప్పుడతను అచ్చటి భోగము లనుభవించి మనుష్యలోకమునకు వచ్చును. (3)

మాత్రాత్రయముతో గూడిన ఓంకారమును ఉపాసించినచో తేజోవంతమగు సూర్యలోకమును చేరుచున్నాడు. సర్పమునుండి కుబుసము జారిపోయినట్లు పాపములనుండి విడివడినవాడై ఆ సాధకుడు బ్రహ్మలోకముచేరి పరమాత్మ సాక్షాత్కారమును పొందు చున్నాడు.

అథర్వ శిరోపనిషత్తున దేవతలచే రుద్రుడు స్తుతింపబడు చున్న సందర్భము గల ప్రణవాఖ్యాన మొకటి ఇట్లున్నది.

హృదిస్థా దేవతాః సర్వాహృది ప్రాణాః ప్రతిష్ఠితాః హృదిత్వమసి యో నిత్యం తిస్రోమాత్రా తస్యో త్తరతః శిరోదక్షిణతః పాదౌ య ఉత్తరతః ఓంకారః స । సః ఓంకారః య ఓంకారః స ప్రథవః । యః ప్రణవః సర్వవ్యాపీ సోఽనన్తః ॥

—అవి త్రిమాత్రలు. ఆయన వాటికంటే అతీతముగా ఉన్నాడు. ఉత్తరమున అతని శిరస్సు, దక్షిణమున పాదములు ఉన్నవి. ఉత్తరముగా ఉన్నది ఓంకారము. ఏది ఓంకారమో అదే ప్రణవము. ఏది ప్రణవమో అది సర్వవ్యాపకమై ఉన్నది. ఏది సర్వవ్యాపకమై ఉన్నదో అదే అనంతమై ఉన్నది.

ప్రాపంచిక బంధముక్తిని కలిగించుటలో ప్రణవమే పదునైన బాకుగా ఉన్నది. క్షురికోపనిషత్తు అనుసారము—

శ్లో॥ ప్రాణాయామసుతీక్ష్ణేన మాత్రాధారేణ యోగవిత్ ।
వైరాగ్యోపలఘృష్టేన ఛిత్వాతన్తు న బధ్యతే ॥

— ప్రాణాయామము ద్వారా అత్యంత తీక్షణమైనదర్చబడిన ఓంకారరూపమను పదునుగల వైరాగ్యమను రాతిమీద సాన పట్టిన (మనస్సు అనే) బాకుతో ప్రణవమను దారమును ఖండించిన యోగవేత్తయగు సాధకుడు మరల దానిచే బంధింపబడడు.

# పురాణములందు ప్రణవ ప్రతిపాదనము

పురాణములందు గూడా ప్రణవము పరమాత్మ స్వరూప మనియే ప్రతిపాదింపబడినది—

శ్లో॥ ఇత్యే తదక్షరం బ్రహ్మ పరమోంకార సజ్ఞితమ్।
యస్తు వేదయతే సమ్యక్ తథా ధ్యాయతి వా పునః॥
సంసార చక్రముత్సృజ్య ముక్తబన్ధన బన్ధనః।
అచలం నిర్గుణం స్థానం శివో ప్రాప్నోత్యసంశయ॥

—ఓంకారమే ఏకాక్షరుడైన పరబ్రహ్మమై ఉన్నది. ఏ సాధకుడైతే దానిని చక్కగా గ్రహించినవాడై దీనిని పరిపూర్ణ ముగా ధ్యానించునో అట్టివాడు ప్రపంచమందలి జనన మరణము లను చక్రమునుండి ముక్తుడై, సర్వవిధ బంధనములనుండి విడి విడినవాడై, అచలము, నిర్గుణమునగు శివసాయుజ్యమును చేరుట సునది నిశ్చయము (అనగా పునరాగమనము పొందుడు.)

ఓంకారజపమును అనేక రీతులలో కొనసాగింపవచ్చును. అందుకు అవసరమగు విధులను తెలియజేయుచూ, ఉపాసనవలన కలుగు ఫలశ్రుతిని గూర్చి పద్మపురాణము యిట్లు వివరించు చున్నది—

శ్లో॥ యావజ్జీవ జపేన్మన్త్రి ప్రణవం బ్రహ్మణో వపుః।
హ్రస్వో దహతి పాపాని దీర్ఘశ్శాన్తి ప్రదాయకః।
ప్లుత స్తు సర్వసిద్ధిః స్యాత్ప్రణవత్త్రివిధః స్మృతః॥

—ప్రాణమున్నంతవరకు ప్రణవోపాసనం చేయుచుండ వలసినదే. దానిని మందము (ఉపాంశువు)గా ఉచ్చరించుటవలన అది పాపములన్నింటిని పోజేయును. దీర్ఘ ఉచ్చారణము శాంతిని చేకూర్చును. ప్లుతోచ్చారణము సర్వవిధ మనోరథములను సిద్ధింప జేయును. ఇట్లు ప్రణవోచ్చారణము త్రివిధములని చెప్పబడినది.

జపమంత్రవిధములు :- ఉపాంశువు, దీర్ఘము, ప్లుతము-అని. మందస్వరమున చేయబడు జపం ఉపాంశువు. దానిని రెండవవ్యక్తి వినలేడు.

ఉపాంశుజపమనగా జపసమయమున చేయబడు మంత్రపఠనము ప్రక్కనగల వ్యక్తికికూడ వినబడనంత నెమ్మదిగా మంత్రోచ్చారణ జరుగవలెను. అంటే మంత్రపఠనమున పెదవులు కదలుచున్నను ధ్వని ప్రక్కవానికికూడ తెలియనంతటి నెమ్మదిగా జప సాధనను కొనసాగించుట - అని.

దీర్ఘ స్వరమున కొనసాగించు జపము అందరకు విన బడును. ప్లుత మనగా మానసిక జపము అని భావం. మానసిక జపమునందు పెదవులు కూడా కదలవు. మానసిక జపము సర్వోత్తమమైనది. ఉపాంశు జపము మధ్యమము. దీర్ఘోచ్చారణము లేక పెద్దగా అందరకు వినబడునట్లు చేయు జపము నికృష్టశ్రేణికి చెంది నదిగా తలంపబడుచున్నది.

వేదాది శాస్త్రములకు ఆరంభమున, అంత్యమందు ప్రణవ మును ఉచ్చరించుట తప్పనిసరిగా ఉన్నది. భవిష్యపురాణాభిప్రాయానుసారం—

శ్లో॥ బ్రహ్మణః ప్రణవం కుర్యాదాదార్యతే చ సర్వదా ।
స్రవత్యవోం కృతం పూర్వ పరస్తాచ్చ విశీర్యతే ॥

బ్రహ్మసంబంధమగు అధ్యయనము (బ్రహ్మమును గూర్చి తెలియజేయు వేదాధ్యయన సమయమందు) ఆరంభమున. అంత్యమున ఎల్లప్పుడు ప్రణవమును ఉచ్చరించవలెను. ప్రారంభమున ఓంకృతముకానిది (ఓంకారోచ్చరణముతో ప్రారంభము కానిది) స్రవితమై, అంత్యమున విశీర్ణము (వ్యర్థము లేక నష్టము) అగును. అభిప్రాయమేమన - శ్లోకమే కావచ్చును. లేక ఋక్ అయినను పూర్వమున (ప్రారంభమునందు) ఓంకారమును చేర్చకుండా జపించినట్లయితే అటువంటి జపము ఫలదాయకము కానేరదు. అట్టి సాధన నిష్ఫలమగును.

## గోపథ బ్రాహ్మణమునందలి సర్గోపాఖ్యానము

ప్రళయకాల సమాప్త్యానంతరం పునః సృష్టి నిర్మాణ సమయం ఆసన్నమైనపుడు సర్వప్రథమముగా బ్రహ్మోత్పన్నమయ్యెను. ఆయన ఈ సృష్టి నిర్మాణమునుగూర్చి సృష్టి ఎట్లుండవలెను ? అని ఆలోచింపసాగెను. ఈ విషయమై గోపథ బ్రాహ్మణమున చర్చించుట జరిగినది—

సఖలు బ్రహ్మ సృష్టిః చిన్తామాపవేకేన అహ ఏకేన అక్షరేణ సర్వాం చ కామాన్ సర్వాం చ లోకాం సర్వాం చ దేవాన్

సర్వా చ యజ్ఞాన్ సర్వా చ శబ్దాన్ సర్వా చ వ్యుష్టోః సర్వాణి చ భూతాని స్థావర జంగమాని అనుభవేయమ్।

బ్రహ్మ ఆలోచింపసాగెను - ఒక అక్షరమును, సర్వవిధ మగు కోర్కెలను, ప్రజలందరును, ఎల్ల లోకములను, సర్వదేవతలను, అన్ని యజ్ఞములను, సర్వవిధములగు జ్ఞాన-విజ్ఞానములను. సర్వవిధస్థావర, జంగమ ప్రాణులను సృష్టించెదను - అని తలంచెను.

## ప్రాణులు - తెగలు

1. అండజములు - గ్రుడ్ల నుండి జనించునవి.
   (పక్షులు, సర్పములు మొదలైనవి)

2. స్వేదములు - చెమటవలన పుట్టునవి.
   (పేలు, నల్లులు మొదలైనవి)

3. ఉద్భిజములు - భూమినుండి పైకివచ్చినవి.
   (ఓషధులు, గరిక, లతలు, వృక్షములు మొదలైనవి)

4. జరాయుజములు - మావితో బుట్టునవి.
   (మనుష్యులు - మృగములు)

ఇందువలన ఒక్క మానవజాతి మినహా అన్యజాతులందు వేరువేరు సముదాయములు ఉన్నవి. ఆయాజాతులందుగల భిన్న భిన్న సముదాయములనుబట్టి ఆయా సముదాయములందలి జీవుల గుణ, స్వభావముల ననుసరించి ఆ మేరకు అవి వేరువేరు జాతు

లుగా పరిగణింపబడుచున్నవి. ఎట్లన - వృక్షములందు - అనగా ఉద్భిజములందు మామిడి, వేప, పనస, వెలగవంటివి భిన్నభిన్న జాతులకు చెందినవి అట్లే—

జరాయుజములు - అనగా మావితోబుట్టు ప్రాణులందు మృగములు, మనుష్యులు గలరు. మృగములందు ఏనుగు, సింహము, పులి, ఒంటె, మేక, ఆవు ఆదిగాగల వేరువేరు జాతులున్నవి. కాని ప్రపంచవ్యాప్తముగా ఉన్న మనుష్యులందు లింగభేదముతప్ప జాతిభేదం కానరాదు గుణ, స్వభావ, కర్మల వ్యత్యాసములతో జూచినా శరీర నిర్మాణదృష్ట్యా మానవులందరు ఒకే జాతికి చెందినవారు.

అంటే జ్ఞానములందు జాతులు ఉన్నవి - కోడి, నెమలి, చిలుక, హంస, గ్రద్ధ, బాతు మొదలైనవి. జరాయుజములందు ఇట్టి వ్యత్యాసంలేదు. ఇందువల్లనే మన పూర్వులు ఈ విశ్వము నంతటిని ఒక్కటిగా జూచి 'వసుధైవ కుటుంబకమ్' 'సర్వేజనా స్సుఖీనోభవంతు అని, భావించారు. ఇది మానవత్వానికి మణిమకుటం. (అనువాదకుడు)

ఆలోచించినకొలది బ్రహ్మకు ఏమియును స్ఫురించలేదు. అప్పుడు ఆయన బ్రహ్మచర్యమును ఆహ్వానించెను. అనగా బ్రహ్మచర్య వ్రతమును అవలంబించుచూ ఆయన ధ్యానమగ్నులై ఉండిరి. ఆ స్థితిలో ఆయనకు అక్షర బ్రహ్మసాక్షాత్కారమయ్యెను.

ఆ అక్షరబ్రహ్మము సర్వవ్యాపకము, చతుర్మాత్రా యుతము, ఆయానయామముగా ఉండెను. ఆ బ్రహ్మ కృపవలన సమస్యాపరిష్కారము జరిగెను ఆయన అంతఃకరణమున సృష్ట్యోప క్రమమునుగూర్చి తెలియసాగెను.

అప్పుడాయన ఓంకారపు ప్రథమమాత్రలో ఋగ్వేదము, పృథ్వీలోకములను సృజించెను. ద్వితీయమాత్రలో యజుర్వేదము, అంతరిక్షలోకములను సృష్టించెను. తృతీయమాత్రలో సామ వేదము, ద్యులోకములను సృష్టిజేసెను. చతుర్థమాత్రలో అథర్వ వేదము, ద్యులోకములను సృష్టించెను. మకారంతో ఇతిహాసము-పురాణములను సృష్టించెను.

ఇట్లు ఓంకారమునందలి నాల్గు మాత్రలతో ఆయన దృశ్యా దృశ్య జగత్తును వ్యక్తపరచెను. ఈ సౌరమండలములు, ఈ ఆకాశగంగలు, నీహారికములు (తేజోవంతములైన పొగమంచు తెరలు) ఓంకారము నందే ఉండెను. ఇవి ఓంకారమునకు వెలుపల లేవు. ఏమాత్రం లేవు.

పై ఉపాఖ్యానము ప్రణవోపాసనకు చెందిన విధినికూడ తెలియజేయుచున్నది. సాధకుడు బ్రహ్మచర్య వ్రతావలంబియై ఓంకారసాధన కొనసాగించినచో అట్టివానికి సర్వసిద్ధులు సిద్ధించు చున్నవి.

ఓంకారమునుండే శబ్దము జనించెను. ఇందుచే నిది పరమ శబ్దమని విదితమగుచున్నది. శబ్దమే నాదము. కాన సాధకుని

చిత్తము ఓంకారరూపముననున్న నాదమునందు లయించినప్పుడు ఆతనికి అంత్యమలక్ష్యము ప్రాప్తించుచున్నది. ఇట్లు ఓంకార సాధనమున సకల సాధనలు సమన్వితమై ఉన్నవి. గాయత్రీ మంత్రమునకు ఆదియందు వ్యాహృతులకంటె ముందుగల ఓంకార యోగము మంత్రమహిమను మరింతగా వృద్ధిచేయుచున్నది.

— ० —

# ఓంకారము — ఇరువది అర్థములు

## సర్వవ్యాపి ప్రణవము

'ఓం' శబ్దము సర్వవ్యాపకమైనది. "అప్లృ" మరియు 'అవ' ధాతువులతో అది సిద్ధించుచున్నది. 'అప్లృ' ధాతువు వ్యాపకార్థసూచకమై ఉన్నందున దానినుండి ఉత్పన్నమైన 'ఓం' యొక్క అర్థంకూడ సర్వవ్యాపియగుచున్నది. 'అవ' ధాతువు వలన రక్షణపరమైన తాత్పర్యం వ్యక్తమగుచున్నది. వీటి కారణమున ప్రపంచమును రక్షించునది - అను నర్థము వచ్చుచున్నది.

పాణిని అభిప్రాయానుసారం 'అవ' ధాతువునుండే ప్రణవోద్భవము జరిగినది. 'అవ' ధాతువు మన ప్రత్యయమగును, 'టి' లోపించును. (యథా అవనష్టిలోపః) అవ + మ్ అవస్థలో కృదంతసూత్రంతో 'వ' 'ఊఠ' అయినప్పుడు అ + ఊ + మా సిద్ధించును. అప్పుడే అద్ గుణః సూత్రంవలన గుణసిద్ధి కలిగి

నప్పుడు 'ఓం' ప్రత్యక్షమగుచున్నది. 'అవతి ఇతిఅ' 'ఊమ్' ఏదైతే ఆవిద్య మరియు దాని కార్యములనుండి మనలను రక్షించునో అదియే 'ఓమ్'.

ఆచార్యవర్గం అవధాతువునకు ఇరువది అర్థములు వివరించిరి. కొందరు పందొమ్మిది అర్థములనే అంగీకరించగా మరి కొందరు మరిన్ని అర్థములను అంగీకరించుట జరిగినది. కాన ఇచ్చట ఇరువది అర్థములను గూర్చియే వివరించుట చాలునని అభిప్రాయపడుచున్నారు.

## 1. అవరక్షణ

'అవ' రక్షణే అనుటనుబట్టి ప్రపంచ సాగరమునుండి రక్షించునది అనగా జనన మరణములనుండి కాపాడునది సాధకుని పాపపుణ్యములను క్షయమొనర్చి కైవల్యప్రాప్తి చేకూర్చునది. బృహద్యోగవాల్క్యల అభిప్రాయానుసారముగా కూడ ఇదియే ధ్రువపడుచున్నది. ఎందుకనగా ఆయన ప్రణవమును భవసాగరమునుండి తరింపజేయు మంత్రము అనిరి.

శ్లో॥ సర్వ దుఃఖ సముత్థానాద్ భవగ్రాహార్ణ వాకులాత్ ।
చిన్తి తస్తారయేద్యస్మాత్తేన తారో నిగత్యతే ॥

## 2. గతి

ఈ అర్థానుసారము ప్రణవమును సర్వగతమని అంగీకరింపబడుచున్నది. ఎట్లన బ్రహ్మము సర్వగతమైనది. అంతేగాక

ఓంకారము బ్రహ్మకు ప్రతీకమై ఉన్నది. దాని గతిలో ఎచ్చట, ఎటువంటి అవరోధము లేదు. ఈ మూడు సూత్రములతో దానిని చక్కగా అర్థము జేసుకొనవలెను—

'అవతి సంసార చక్రో యస్మాద్ గచ్ఛతి' అనగా ప్రపంచ చక్రమును నడుపునది గాన నిరంతరగతి శీలమై ఉన్నది.

'అవతి సర్వ జానాతి' అనగా సర్వవేళలందు సర్వ పదార్థ ములను తెలుసుకొనినదై ఉన్నందున సర్వగతమై ఉన్నది.

'అవతి సర్వత్ర వ్యాప్నోతి' అనగా సర్వవ్యాపకమై నిరంతర గతిశీలమై ఉన్నది.

'అవతీ జ్ఞానేన విశ్వం ప్రవర్తతి తు ప్రయత్నం కరోతి' అనగా విశ్వమును జ్ఞానయుత సంకల్పములతో ఉంచుటయేగాక అందుకు వలయు ఉత్తేజమును కలిగించి తదనుసారము వర్తింప జేయునది అయినందున విశ్వప్రవర్తకమై ఉన్నది.

## 3. మతి

ఓంకారము బుద్ధిప్రదాయిని అయినందున 'మతి'మై ఉన్నది. సద్బుద్ధి ప్రేరకమైనందున దానిని 'మతి' అనుట జరిగి నది. 'అవతి బుద్ధి కరోతి' బుద్ధిని ఉత్పన్నము చేయునది. 'సహో స్త్రైవ ప్రబుధ్యన్తే యత్రైవ ప్రత్యగాత్మని' అదేమాదిరి ప్రణవ ధ్వని నుండి అంతరాత్మ ప్రబుద్ధమగుచున్నది.

## 4. ప్రీతి

ఓంకారము బ్రహ్మము యొక్క ప్రేమమయమై ఉన్నది. అది ప్రాణులను ప్రేమించునదైనందున ప్రాణులన్నియు దానిని ప్రేమించుచున్నవి. ఇందువల్ల దానిని సహృదయ అని కూడ అనుట జరుగుచున్నది. 'అవతి సర్వ ప్రీతయతి' అంటే సర్వప్రాణులను ప్రేమించునది అని.

## 5. తృప్తి

ఓంకారబ్రహ్మము సర్వమును తృప్తిపరచునది. అదొక్కటియే ఎటువంటి నాదమనగా దానిని యదార్థరూపములో వినినట్లయితే వినవలసినదంటూ మరేదియూ మిగిలి ఉండదు. 'అవతి భక్తాన్తర్పయతి' - తన ఉపాసకులకు తృప్తి కలిగించునది లేక అది తన ఉపాసకులను వారు విశ్వమందలి ప్రతిప్రాణిని ప్రేమించ గలిగినంతటి శక్తివంతులుగా చేయునది.

## 6. కాంతి

కాంతి అంటే ప్రకాశము అని, సర్వమును బ్రహ్మము వల్లనే ప్రకాశితమైనది, 'ఓం' ధ్వని తరంగములు సాధకుని హృదయమును ఉజ్వలింప చేయునపుడు జ్ఞానాధ్యయనము వలన కలిగిన ప్రకాశము వెలుగొందుచున్నది, కాంతి - జ్ఞానమునకు పర్యాయమై ఉంటే, ప్రణవము స్వయముగా జ్ఞానరూపమే అయి ఉన్నది.

## 7. అవగవం

'అవతి అవగచ్ఛతి' - సర్వత్ర గమనశీలియైనది లేక అందరి మనోభావములకు జ్ఞాత. కొంతమంది ఆచార్యులు దీనికి ఈ విధమైన అర్థము చెప్పుచున్నారు—ప్రణవము సర్వప్రాణుల హృదయాంతరాళములను తెలిసినది. అది ప్రాణియొక్క ఆంతరిక భావములను భావానుభూతిని గ్రహించి తదనుగుణ్యమైన ఫలముల నొసంగ గలిగిన సామర్థ్యము కలిగి యున్నది.

## 8. ప్ర వే శ

అన్నిటియందు ప్రవేశించగలిగిన సామర్థ్యము గలిగినది. అందరి శరీరములందు పరమాత్మ ప్రవేశించి వసించుచున్నాడు. ఆయన సూక్ష్మాతిసూక్ష్మడు. 'అవతి సూక్ష్మత్వా ప్రవిశతీతి' - సూక్ష్మమై ఉన్న కారణమున అన్నింటియందు ప్రవేశించ గలుగు చున్నాడు.— శ్వేతాశ్వరోపనిషత్తు అభిప్రాయానుసారం

శ్లో॥ 'స్వదేహ మరణం కృత్వా ప్రణవచోత్తరారణమ్ ।
ధ్యాననిర్మథనాభ్యాసాత్ దేవం పశ్యేన్నిగూఢవత్ ॥

—తన అన్తఃకరణమున అధికారిణే, ప్రణవమును ఉత్తరారణిజేసి ధ్యానరూపమను మన్థన దండపు ఘర్షణోపరాన్తము అభ్యాసము జేయుచూ అంతరాత్మలో ప్రతిష్టుడై ఉన్న పరమాత్మ జ్యోతిని చూడరావలెను.

## 9. శ్రవణము

అది శబ్దములన్నింటిని గ్రహించగలిగినంతటి సామర్థ్యవంతమైనది. దానికి వినబడనిదంటూ ఏమియులేదు. ఇందువలననే ఏదేని కోరవలసి ఉన్నచో ఆ పరమాత్మనే వేడుము. నీ కోర్కెను ఆయనయే ఆలకించగలడు. లేదా 'అవతి సర్వ శృణోతి' ఆయన అందరి విన్నపములను ఆలకించును. గోస్వామి తులసీదాసు అంటారు—'బిను పదచలై, సునై బిను కానా' - పాదరహితుడయ్యూను చరించును. కర్ణరహితుడై కూడ ఆలకించును—అని.

## 10. సామర్థ్యము

ఓం స్వరూపుడైన బ్రహ్మ ప్రపంచమంతటికి లేక సర్వప్రాణులకు స్వామియై ఉన్నాడు. "అధిపత్య కరోతి' ఆయన విశ్వమంతటికి అధిపత్యము వహించి ఉన్నాడు. ఈశావాస్యోపనిషత్తునందలి ప్రథమమంత్రమే యిది.

శ్లో॥ 'ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుఞ్జీథా గృధః కస్య స్విద్ధనమ్' ॥

స్థావర జంగమరూపమున ఈ బ్రహ్మాండ మంతటను నిండియున్నదంతయు దైవాధీనమై ఉన్నది. అది ఆయన సంపత్తియే సుమా! కాన నీకని ప్రత్యేకించిన వస్తువులనే తీసుకొనవలసి ఉన్నదని గ్రహించినవాడవై ఇతరుల వాటిని అనుభవింప వాంఛింపకుడు.

"పితు మాత సహాయక్ స్వామి సఖా తుమ్ హీ ఇకనాథ్ హమారే' తండ్రి, తల్లి, సహాయకుడు, స్వామి, సఖుడవగు నీవే మాకు ఏకైకనాథుడవై ఉన్నావు. పరమాత్మయే సర్వస్వమని భావించినప్పుడు ఇటువంటి స్తుతియే జరుగును. 'శ్రీకృష్ణ చరిత మానస్' రచయితయైన కవిరాజ దాదూదయాల్‌గుప్త 'లోలాకాన్త ము'న అంటారు.

మైం తవదాస్ సతత అనుగామీ।
అస కహి పుని పూజే జనస్వామీ ॥

—నేను నీ దాసుడను. సతతము నీ అనుగామినై ఉంటున్నాను. కాన వేరెవ్వరిని పూజింపలేను స్వామి.

## 11. యాచనీయుండు

బ్రహ్మము సర్వులయొక్క సత్యసమ్మతములైన కోర్కెలను తీర్చుచుండును. కనుక ఆయనను కోరవలసిన అవసరము లేదు. భక్తుని చిత్తమున ఏదేని ఒకటి కావలెనను కోర్కె కలుగుటయే యాచన, భక్తుని కోర్కె ఏదియును తీరకుండుట జరుగదు. ఆయన వద్ద ఎన్నడును ఎటువంటి అభావము లేకుండుటయే ఇందుకు కారణము.

## 12. క్రియ

ఈ విశ్వమంతయును ఇచ్ఛా-క్రియా-శక్తులతోనే నడచుచున్నది. 'బ్రహ్మ ఏకోఽహం బహుస్యామ' అని జగత్సృష్టికి

సంకల్పించెను. క్రియాశక్తితో ఈ విశ్వమును నిర్మించెను. ఇట్లు ఈ విశ్వమంతయు ఆ ప్రణవ పరమాత్ముని ఇచ్ఛాశక్తి, క్రియా శక్తి ప్రభావముననే క్రియాశీలతలో తత్పరమై ఉన్నది.

## 13. ఇచ్ఛా

పరమాత్మ నిస్పృహుడు. ఆయన ఏదియును కోరడు. 'ఏకోఽహం బహుస్యామి' తలపుకూడ ఆయన ఒకానొక స్వార్థ పూర్తికనిగాక లోకహితముననకే సంకల్పించెను. ఇందుచే ఆయన స్వయముగా తలంపకయే ప్రాణులను కర్మిష్ఠుల జేయును. కొంతమంది ఆచార్యుల అభిప్రాయానుసారం 'అవతి ఇచ్ఛతి' - జీవుల సుఖములు కోరుచుండును.

## 14. దీప్తి

ప్రకాశస్వరూపుడైన బ్రహ్మ అజ్ఞానాంధకారమును నివర్తించు సమర్థుడు. ఓంకార ఉపాసనము దుర్బుద్ధిని, అవివేకమును పోజేసి శివకరప్రకాశమును నింపును. దీని సాధకుడు ఋతంభరా ప్రజ్ఞను సులువుగాపొందగలడు. విశ్వము విశ్వాత్మయగు బ్రహ్మము యొక్క శక్తిని తెలుసుకొనగల వివేకము జాగృత మగును.

## 15. వ్యాప్తి

వ్యాపకత్వం బ్రహ్మమునందలి సహజ లక్షణం. బ్రహ్మ లేని స్థానము, వస్తువు జీవి అంటూ ఏదియును లేదు. ఆయన సర్వ ఘటములందు వశించుచున్నాడు కాన ఆయనను కనుగొనుట

కని మరెచ్చటికో పర్వులెత్తవలసిన అవసరంలేదు. ఇదేగాక సాధకుడు తన హృదయమునందే ఆత్మరూపుడై రాజిల్లుచున్న ఆ బ్రహ్మమును దర్శించవగును. 'అవతి ప్రదర్శయతి' - సాధకుని సత్య సాధనను జూచి సాక్షాత్ దర్శనమిచ్చును.

## 16. ఆలింగనము

బ్రహ్మ, ఆత్మ ఒక్కటేయైనందున ఆయన అందరిలోను నిర్లిప్తభావమున కలసి ఉన్నాడు. 'అవతి ఆలింగయతి' ఆయన అందరిని ఆలింగనము జేసుకొని ఉన్నాడు లేక ఆయన అందరి హృదయములందు అభిన్నునిగా ఉన్నాడు. అనగా అన్ని శరీరములందు కలడు. ఆత్మ, పరమాత్మకూడా ఆయనయే. 'శ్రీకృష్ణ చరితమానస్' నందు —

సును నృప కృష్ణ బ్రహ్మ అవినాసీ ।
స— జీవన్హ కే అన్తరవాసీ ॥
ఆత్మరూప్ బై రేవు హియ మాఁహీ ।
తేహిం సన్ప్రీతి హోయి కిను నాఁహీ ॥

ఓ రాజా వినుము. బ్రహ్మయగు కృష్ణుడు అవినాసి. సర్వజీవుల అంతరాళములందు వాసము జేయుచున్నాడు. ఆయన ఆత్మరూపమున హృదయవాసిగా ఉన్నాడు. ఆయననే సత్యప్రీతితో ఆరాధించవలెనుగాని మరెవ్వరినికాదు.

## 17. హింస

బ్రహ్మమునందు హింసనుగూర్చి చెప్పుటలోగల అభి ప్రాయమేమన - ఆయన సర్వవిధ అజ్ఞానమును పోజేయుటలో కడు సమర్థుడు - అని.

దుష్కర్మములపట్ల ఇసుమంతయును ఉదారవర్తనుడు కాలేడు. 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్' (గీత) అనగా సజ్జన సంరక్షణకు దుష్టజనశిక్షణ కనియే నేను యుగయుగములందు (ఆయాసమయములందు) అవతారరూపమున పృథ్విపై అవతరించుచున్నాను.

## 18. దానము

పరమాత్మను మించిన దానశీలుడు వేరొండులేరు. ఆయన సర్వప్రాణులకు శరీరము జీవము వివేకవంతమైన బుద్ధిని జ్ఞానము లను దానము చేయుచుండుట కూడ ఆయన స్వభావముగా ఉన్నది. ఒక కవి అంటారు—

జో యాఁచా సో పాయియా మాలిక్ కే దరబార్ ।
జో దిల్ మేఁ సచ్చీ లగన్, వహాఁ కహాఁ ఇన్కార్ ॥

ఈ విధమున ఆయన దర్బారులో ప్రవేశించిన వారందరకు వారివారి కోర్కెల ననుసరించి అన్నియును సిద్ధించునవి - అని.

ఆ ప్రభు సాన్నిధ్యంలో ఎవరు ఏదికోరితే వారికది లభిం చుచునే ఉన్నది. సత్యమైన భక్తి, శ్రద్ధలతో నిండిన హృదయ ములు పొందనిదేమిటి ? అట్టి వారలకు తిరస్కారమెక్కడిది !

## 19. భోగము

ఇది భక్షణ సంబంధమైనది. ప్రళయావస్థలో ఈ విశ్వమంతయు ఆయనలోనే లీనమగుచున్నది. 'అవతి లీనం కరోతి' అనగా సృష్ట్యంతమున సృష్టిసంతతిని తనలో లీనము జేసుకొనుచున్నాడు. ఈ ప్రకారము బ్రహ్మ అన్నింటికి ఉత్పత్తి కర్త పాలనకర్త మరియు సంహారకర్త అగుటవలన సర్వసమర్థుడై ఉన్నాడు.

## 20. వృద్ధి

'వృద్ధి'కి అనేక అర్థములు. వృద్ధి పరచుట, వ్యక్తీకరించుట, ఉత్కృష్టపరచుట మొదలైనవి. 'అవతి వర్ధయతి' సృష్టి ప్రారంభమున సూక్ష్మరూపముగా ఉన్న ప్రకృతిని స్థూలీకరించుట ఆరంభమున సృష్టి చాలా తక్కువగా ఉండుట. కాలక్రమమున అభివృద్ధిగాంచుట జరుగును. ప్రపంచ జనాభా నిత్యం వృద్ధి పొందుట మనం చూస్తున్న విషయమే. ఈసంఖ్యావృద్ధికూడ పరమాత్మని ఇచ్ఛలేకుండ జరుగ నేరదు. ఒక సామెత — జన్మనిచ్చువాడు, పోషించువాడు చివరన మరణింపజేయువాడు కూడ ఆ దైవమే - అని, ఈ విధమున బ్రహ్మ స్వభావము సూక్ష్మమును స్థూలీకరించుచున్నది. 'ఏకోఽహం బహుస్యామ' ఇచ్ఛ స్ఫురణబుద్ధికి సంబంధించిన భేదములే.

ఈ విధమున ఓంకారమునకు చెందిన పై ఇరువది అర్థములు బ్రహ్మము యొక్క విభిన్న విశేషతలను తెలియజేయు

చున్నవి. కాన ఏ సాధకుడు ఏ భావముతో పరమాత్మను చింతించునో అతడు అటువంటి ఫలమునే పొందుచున్నాడు.

వ్యాకరణ దృష్ట్యా 'ఓం' అవ్యయము. దానికి ఏ రూపము ఉండదు. అది లింగరహితము రూపరహితమేగాక అకల్పనీయమై ఉన్నది. కాని ఎవరైతే సాకారోపాసకులో వారుకూడ ఓంకారోపాసన ద్వారా అటువంటి ఫలమునే పొందగలరు. ఇందుచే ఓంకారోపాసనము తప్పక కళ్యాణప్రదమై ఉన్నది.

ఓంకార ఉపాసనం వ్యక్తిగతంగా సామూహికముగా రెండు విధములా వికాసోపయోగకరమై ఉన్నదే. ప్రణవ సంబంధములగు వివిధవ్యాఖ్యలు ఉన్నవి. భగవాన్ శంకరుల వ్యాఖ్య ఇది—

'ప్రకృష్ట నూతనో వర్ణో నిత్యనూతన విగ్రహః'

ఓంకారము ప్రకృష్ట నవీనవర్ణము. మరియు విగ్రహము - 'ప్ర' యొక్క అర్థం 'అత్యంతము' అని. మరియు ప్రకృష్టమునకు అధికమైన ఉత్కర్షము అని కూడ అర్థం ఉంది. అనగా ప్రణవము ఉత్కృష్టముకంటే ఉత్కృష్టమైనది అని అర్థం. అంటే దీనిని మించిన ఉత్కృష్టత కలది మరొకటిలేదని అర్థం. ప్రకృష్టమనగా అతివ్యాపకమైనదని అర్థం. అది దేశ, కాలాదులనుగూడ అపేక్షింపనిది. అది సర్వత్ర వున్నది. నూతన అనుదాన్కి నవీనమైనదని అర్థం. అనగా నిరంతరం ఏకరసావస్థలో వుండునది. ఒకప్పుడు వృద్ధి చెందునది, మరొకప్పుడు జీర్ణమగునదికాదు. దానికి వృద్ధాప్యం

లేదు. ఒకానొకప్పుడు దానిని ఏ రూపంలో చూస్తే నిరంతరం అదే రూపమున కనబడుచుండునది.

ప్రణవము నూతనమైనదనుటలోగల అభిప్రాయం - అది నిత్యం ఉత్పన్నమగుచుండునని తలంపకూడదు. అది ఎన్నడును ఉత్పన్నమగునదిగాక అనాదియైనది - సనాతనమైనది. ఉత్పన్న మెట్లగును ?

అయిననూ నూతనత్వంతో పాటు 'వర్ణములు' అనుటచే రూపవిశేషము సంతరించుకున్నదని అర్థము కలిగి ఉన్నది. కమలము వికసించనంతవరకు కలికగా వుండును. అది వికసించి నప్పుడు దానినే పుష్పము అనుచున్నారు. వికసించుటకు గల పూర్వావస్థలోను, వికసించిన తరువాత అవస్థలోను వర్ణము, ఆకారము రెండింటియందు వ్యత్యాసము కలుగుచున్నది. కాని బ్రహ్మమునందు ఎన్నడును వర్ణరూపములందు ఎటువంటి వ్యత్యాసము కలుగదు. అయ్యది ఎవ్విధమగు రంగు రూపము లేనిదై నిరాకారమున వున్నది. అది నిరాకారమై వున్నందున దానికి వర్ణ రూపములను ఆపాదించుట ఎట్లు సాధ్యమగును ?

దాని తరువాత నూతన శబ్దం మరల ప్రయోగించుట జరిగినది. అంతకు పూర్వం 'నిత్య' శబ్దం కూడి వున్నది. నిత్యమైనది ఎన్నటికిని పాతబడదు. సతతము నవ్యతతో విలసిల్లుచుండును. ఇందువలననే బ్రహ్మమును 'నిత్యనూతనము' అనే అభిప్రాయం అత్యంత ఆదర్శనీయముగా వున్నది. ఏలనన. ఆకర్షణీయమైనది సతత నూతనత్వము కలిగినదై కన్పట్టుచుండును.

ఇప్పుడు 'నిత్యము' అనుట మిగిలి ఉన్నది. నిత్యమైనది అంటే ఎన్నటికి నశించనిది-అని. నశించని దానిని నిత్యమైనదనియే అంటారు. 'అవ్యయము' లేక 'అవినాశి' కూడ ఇదే అర్థము కలిగి ఉన్నది. సదా ఏకరసము, ఏకరూపము కలిగినది నిత్యమైనదే. ఏలన అనిత్యమైన దాని రూపము మారుచుండును. ఈ విధమున బ్రహ్మము నిత్యుడు, అపరివర్తనుడు అయి వున్నాడు.

'విగ్రహము'నకు ప్రతిమ అనే అర్థం ఉన్నప్పటికి పరమాత్మ నిరాకారుడని భావించువారల అభిప్రాయానుసారం 'విగ్రహము'నకు భావించిన రూపము అని అర్థం. రూపు లేకున్ననూ మనం దాని విషయమున ఆలోచించుకొనుచున్న ఆ రూపము అత్యంత ఉత్కృష్టతను వ్యక్తీకరించుచునే వున్నది. ఇందువలన ఓంకారముతో సరితూగగల ఉత్కృష్టమైనది మరొకటిలేదు. అదియే ఉత్కృష్టమయమైనది, అదియే ఉపాసనాయోగ్యమై ఉన్నది. కనుక ప్రణవోపాసనము బ్రహ్మోపాసనయే అని రుజువగుచున్నది.

— ० —

# గాయత్రీ త్రివ్యాహృతులు
## వేదములు, జగద్రూపమైన వ్యాహృతులు

ఓంకారానంతరం గాయత్రీ మంత్రము భూః, భువః, స్వః అను త్రివ్యాహృతులతో ఆరంభమగుచున్నది. ఈ మూడు వ్యాహృతులు వేదమాతలుగా చెప్పబడుచున్నవి. వృద్ధహారీతి కథనానుసారం—

శ్లో॥ భూరితిత్యేవ హి ఋగ్వేదో భువః ఇతి యజుస్తథా ।
స్వరితి సామవేదః స్యాత్ ప్రణవో భూర్భువః స్వః ॥

—భూః నుండి ఋగ్వేదము, భువః నుండి యజుర్వేదము స్వః నుండి సామవేదము ప్రభవించినవి. అంతేగాక భూః, భువః, స్వః అను ఈ వ్యాహృతిత్రయం ఓంకారమునుండి ఉత్పన్నమైనవి.

ఈ వ్యాహృతుల మహిమయును తక్కువైనది కాదు సుమా! ఏలనన గాయత్రీమంత్రం వీటితోనే మొదలగుచున్నది. సృష్టి నిర్మాణమునకు పూర్వమే ఇవి ఉత్పన్నమై వున్నవి. ఇందు వలన కూడ వీటికిగల మహత్తు సర్వశక్తి సమన్వితము, పరిపూర్ణము అయినదని స్పష్టమగుచున్నది. వీటికి వ్యాహృతులను పేరెట్లు కలిగెను? యో, యాజ్ఞ (19) ద్వారా ఈ విధమున సహజ నిర్ణయము జరుగుచున్నది.—

శ్లో॥ భూర్భువః స్వస్తథా పూర్వ స్వయమేవ స్వయమ్భువా ।
వ్యాహృతా జ్ఞానదేహేన తేన వ్యాహృతయాః స్మృతాః॥

బ్రహ్మ సృష్టి నిర్మాణమునకు ముందు జ్ఞానమయమగు తన శరీరమునుండి భూః భువః స్వః లను ఉచ్చరించుటవలన ఈ మూడింటికి వ్యాహృతులను పేరు కలిగినది.

ఈ వ్యాహృతులు గాయత్రీమంత్రమునకు ఎందుకు చేర్చ బడినవి? అనే దానిని దిగువ శ్లోకమున వివరించబడినది—

శ్లో॥ భూరాద స్తయో లోకః ఆదరాత్కథితం పునః।
ఏతత్సర్వ బ్రహ్మరూపమితి వక్తు శివస్యపి॥

భూః మొదలగు (భూః భువః స్వః) త్రిలోకములను బ్రహ్మ ఆధారముగా స్మరించెను. అన్నియును బ్రహ్మరూపమై యున్నందున వీటిని మంత్రముతో చెర్చెను.

ఈ విధమున ఉపయుక్తములగు వ్యాహృతిత్రయమునుండి త్రిలోకములు ఉత్పన్నములయ్యెను. విద్వాంసుల అభిప్రాయాను సారము క్రమశః వీటినుండి సత్ - చిత్ - ఆనందముల జ్ఞానమును కలిగెను. త్రిపదీ గాయత్రికీగల ఒక్కొక్క పాదము వీటినుండే కలిగినవి. కాన గాయత్రీయొక్క త్రిపాదములు సత్ -చిత్ - ఆనందములతో కూడి వున్నవి. ఇవి ప్రణవబ్రహ్మమునుండి ఉత్పన్నమైనవి, బ్రహ్మము సత్ - చిత్ - ఆనందముల స్వరూపుడైనందున ఆయనను సచ్చిదానందుడు అనుచున్నారు. వృద్ధ హారితి అగ్ని ఆదిగాగల వాటి ఉత్పత్తికికూడ ఇవియే కారణమై వున్నవి. అనుచున్నారు—

శ్లో॥ అగ్నిర్వాయు తథా సూర్య స్తేభ్య ఏవ హి జేనిరే।
స ఏతాః వ్యహృతీయర్షావాః సర్వవేదం జుహోసిపై ॥

—ఈ వ్యాహృతులనుండే అగ్ని, వాయువు, సూర్యుడు ఉత్పన్నమైరి. ఈ వ్యాహృతులతోపాటు జపముచేయు సాధనకు అన్ని వేదములను అధ్యయన మొనర్చినంతటి ఫలము కలుగుచున్నది.

ఈ వ్యాహృతుల ఉత్పత్తినిగూర్చి కూర్మ పురాణము యిట్లున్నది—

శ్లో॥ ప్రధానం పురుషః కాలో బ్రహ్మ విష్ణు మహేశ్వరః।
సత్యం రజ స్తమిస్త్రిస్రః కామద్ వ్యాహృతయః స్మృతాః॥

ఈ వ్యాహృతులు క్రమముగా ప్రధానుడు, పురుషుడు, కాలము, బ్రహ్మ, విష్ణు, శివుడు, సత్వ - రజ - తమోగుణములు కలిగెనని చెప్పబడినది. ఇవి సృజన - పోషణ - సంహారకశక్తి సంపన్నములై వున్నందున జగత్స్వరూపమై ఉన్నవి. ఈ కారణముననే వీటిని ఉపాసించుటవల్ల భౌతికమగు సర్వసుఖములు చేకూరునని చెప్పబడినది. ఈ విశ్వంమీద అనిలానల సూర్యాదుల (అగ్ని, వాయువు, సూర్యుడు) అనన్య ప్రభావము కలదు. ఈ మూడే అనంత విశ్వమునందలి ప్రాణులందు జీవము కలిగించుచున్నవి. ఇందువల్ల ప్రాణులన్నియూ ఈ వ్యాహృతులనే ఆశ్రయించుకొని మనుచున్నవని సహజముగా తలంపబడుచున్నది.

వ్యాహృతులు బ్రహ్మ యొక్క ఇచ్ఛా - క్రియ - జ్ఞాన శక్తులకు ప్రతీకలుగా వున్నవి. వీటివల్లనే మనుష్యులకు శుభాశుభ కర్మేచ్ఛ జనించుచున్నది. వీటి ప్రభావముననే మనుష్యులు కర్మలు ఆచరించుట. వాటియొక్క శుభాశుభముల జ్ఞానం పొందుట జరుగుచున్నది.

ఇట్లయ్యును ఈ శక్తుల ప్రభావము సదా ఒకే విధముగా ఉండుటలేదు. అదొకప్పుడు హెచ్చుట మరొకప్పుడు తగ్గుట జరుగుచున్నది. కనుక వీటిప్రభావమును నిరంతరం తన కనుగుణ్యముగా వుంచుకొనుటకని వీటి ఉపాసన కొనసాగింపవలసి వున్నది. ప్రతికూలతనుగూడ అనుకూలతగామార్చగలశక్తి ఉపాసనయందున్నది.

వ్యాహృతికి ప్రకాశింపజేయునది, జ్ఞానప్రదాయిని, చూపునది అని అర్థం ఇంతేగాక 'విశేషేణ ఆహృతిః సర్వవిరాట్ । ప్రాహ్లోనం ప్రకాశీకరణం వ్యాహృతిః' ।

—సమస్త విరాట్‌ను విశేషరూపములో ఆహృతి బోధపరచునది, మరియు విరాట్టును దర్శింపచేయునది అయినందున దీనిని వ్యాహృతి అనుచున్నారు.

ఈ విధమున వ్యాహృతులందు ప్రపంచమందలి సర్వవైభవములు, దివ్యఐశ్వర్యములు కూడి వున్నవి. ఇందుచే వీటిని జపించుటవల్ల ప్రపంచమునగల సర్వవిధ భోగములను అథవా బ్రహ్మరూప సందర్శనము బడయనగును. త్రివిధ వ్యాహృతులకు చెందిన వేరువేరు వర్ణనము ఈ దిగువ ఇట్లున్నది—

## ప్రథమ వ్యాహృతి 'భూః'

గాయత్రీ మంత్రమందలి ప్రథమ వ్యాహృతి - 'భూః' కాని దీనినే ప్రథమ లేక ఆది అక్షరమనుచున్నారు. దీనిని ఉచ్చరించుటతో సాధకుడు బ్రహ్మ చింతనాలీనుడైనప్పుడు ఆతను సమాధి అవస్థను పొందుచున్నాడు. ఆ స్థితిలో ఆతను సర్వోత్కృష్టము, సూక్ష్మాతిసూక్ష్మము అయిన స్థితిని చేరుకొని తన ప్రాణము పరమాత్మ ద్వారానే చైతన్యవంతమగుచున్నదనే అనుభూతిని పొందుచున్నాడు.

ప్రాణము పరమాత్మనుండియే చైతన్యవంతమగుచున్నదనుట యదార్థ విషయం. ఏలననగా పరమాత్ముడు లేకుండా ప్రాణముకూడ ప్రాణము కలిగి ఉండలేదు. ఆత్మస్వరూపుడగు బ్రహ్మము శరీరము విడచి వెళ్ళగనే ప్రాణముగూడ శరీరమువదలి వెళ్ళుచున్నది. ఆత్మస్వరూపుడగు బ్రహ్మము శరీరమునుండి వెళ్ళినంతనే ప్రాణమును శరీరమునుండి తొలగుటను ప్రత్యక్షముగా జూచుచున్నాము కనుకనే వేదములు ఆయనను 'దేవానాం సమవర్తతా సురేకః' (ఋగ్వేదము) అనెను. అంటే ఆ ఏకైక బ్రహ్మమే సర్వదేవతలకు ప్రాణమై వున్నాడు - అని.

బృహదారణ్యకము—'ప్రాణస్య ప్రాణమ్'గా బ్రహ్మమును ప్రాణమునకు ప్రాణమని వచించెను. ఇందుచే యజుర్వేదము (4-7) నందు 'ఆయుర్మే పాహి ప్రాణమే పాహి' ఇత్యాదులుగా పలికి, ఉపాసకుడు తన ఆయువును మరియు ప్రాణములను

రక్షింపవలసినదని ప్రార్థించుచున్నాడు. ప్రాణాగ్ని హోత్రోపనిష త్తులో 'ప్రాణోఽగ్నిః పరమాత్మా' అని ప్రాణము అగ్నియని, అదే పరమాత్మయని స్పష్టపరచబడినది.

'భూరితి వా అయ లోకః' లేక 'భూరితి వా అగ్నిః లేదా 'భూరితివై ప్రాణః అని తైత్తరీయోపనిషత్తుకు చెందిన ఋషి 'భూః'ను ఇహలోకము (పృథ్వి) అని. 'భూః'నే అగ్ని అని 'భూ'నే ప్రాణము అనెను. 'భూ'యే సృష్టిస్వరూపమైనందున 'పృథ్వి' అనెను. బ్రహ్మ 'భూ'ను ఉచ్చరించియే సృష్టి నిర్మాణ మును ప్రారంభించెను.

అది తేజోమయము (జ్యోతిస్వరూపము) అయినందున 'అగ్ని' అనబడెను. ప్రజాపతి ఈ వ్యాహృతిని పలికియే అగ్నిని కూడ వెలువరించెను. 'అగ్ని ర్వాయు తథా సూర్య' వీటిలో అగ్నియే మొదటిది. ఈ విధముగా వృద్ధహారీతి అభిప్రాయాను సారముగాకూడ 'భూ' వ్యాహృతినుండి అగ్ని ఉత్పన్నమైనది.

ఈ వ్యాహృతియే జీవప్రదాయిని. ఇందుచే దీనిని 'ప్రాణము అనిరి. మహర్షి దయానందులు గూడ దీనిని ప్రాణ మనిరి. వారు ఈ శబ్దమును వ్యాఖ్యానించుచు దీనిని ప్రాణదాత అని స్పష్టముగా పలికిరి—

—యథా - ప్రాణయతి జీవయతి సర్వాన్ ప్రాణినః స ప్రాణః ప్రాణాదపి ప్రియిస్స్వరూపోవా స చేశ్వర ఏవ' అనగా ఏదైతే సచుస్త ప్రాణులకు ప్రాణరూపమున జీవము నిచ్చు

చున్నదో దేని స్వరూపము ప్రాణముకంటే ప్రియమో ఆ ఈశ్వరుడు 'భూః' అని పిలువబడుచున్నాడు.

అథర్వణ వేదమునందు గూడ ప్రాణమును పరమాత్మగా అంగీకరించుచూ సంపూర్ణ బ్రహ్మాండము ఆయననే ఆశ్రయించి వున్నదని ఇట్లనెను—

శ్లో॥ ప్రాణాయ నమో యస్య సర్వమిద వశే।
యో భూతః సర్వస్యేశ్వరో యస్మిన్సర్వ ప్రతిష్ఠితమ్॥

— దేనియందైతే ఈ సర్వము కలదో ఏదైతే సంపూర్ణ భూతములకు ఈశ్వరుడో, సర్వమును తన వశమున వుంచుకొనునో అట్టి ప్రాణమునకు వందనము.

పై దాని వలన స్పష్టముగా ధ్రువపడుచున్న దేమనగా 'ప్రాణము' అనునది పరమాత్మ అనే అర్థముతో ప్రయోగింపబడినది - అని. బ్రహ్మసూత్రముల అభిమతముకూడ యిట్టిదే — 'అతయేవ ప్రాణః' బ్రహ్మసూత్రములందు 22 వ శ్రుతి (1-1-22)లో ఆకాశాధికరణమున 'ఆకాశ' శబ్దము బ్రహ్మవాచకమైనట్లే (1-1-23) శ్రుతిలోని ప్రాణాధికరణమునందు ప్రాణశబ్దము బ్రహ్మవాచకమే. ఎట్లన చాందోగ్యోపనిషత్తున (1-11-5)లో "సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభి సం విశన్తి. ప్రాణమభ్యుజ్జిహతే" - అని.

అనగా - ప్రాణము బ్రహ్మమే. ఎట్లన ప్రళయకాలమున సర్వభూతములు ప్రాణమునందే చేరుచున్నవి - అని. కాన ఇది ప్రాణధర్మమేగాని ప్రాణవాయువు స్వభావం కాదు. ఎట్లన ప్రాణ వాయువు సంపూర్ణ భూతముల సృష్టి - లయములకు కారణము కాజాలదు. కాన ప్రాణము ద్వారా యిచ్చట పరబ్రహ్మమే సూచింపబడినది.

అనగా ఇందు పరబ్రహ్మమే ప్రాణమై వున్నది. యజుర్వేదము (39/1)లో ప్రాణములకని ఆహుతులివ్వబడును— స్వాహా ప్రాణేభ్యః 'సాధిపతి కేభ్యః' అనగా సర్వాధిపతి యగు హిరణ్యగర్భుడైన ప్రాణమునకు స్వాహుతము 'ప్రాణసహితుడగు బ్రహ్మరూపమున శరీరమందుగల ఆత్మయొక్క పుష్టికి ప్రయత్నించవలసి వున్నది. ఆ ప్రయత్నసిద్ధి 'భూః' వ్యాహృతి ద్వారా సహజముగా జరిగిపోవును.

ఛాన్దోగ్యోపనిషత్తున స్పష్టముగా చెప్పబడినది—

'ప్రణేతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే'।

ఈ సమస్త భూతములు ప్రాణమునందే ప్రవేశించుచున్నవి ప్రాణమే సమస్త భూతములను ప్రాణవంతము చేయుచున్నది. అదియే వీటికి జీవమునిచ్చును. మరియు జీవింపజేయునదియును అదియే.

ఈ విధముగా 'భూః' అను వ్యాహృతి ప్రాణస్వరూపమై వున్నది. ప్రాణులందు జీవము మరియు తేజస్సులను నెలకొల్పు చున్నది కూడ అదియే.

## ద్వితీయ వ్యాహృతి - భువః

ఇది గాయత్రియొక్క ద్వితీయ వ్యాహృతి లేక ద్వితీయాక్షరము. దీనియొక్క ముఖ్యార్థం 'దుఃఖనివృత్తి చేయునది' అని. ఆచార్యుల అభిప్రాయం ఏమనగా — ఏ జపమునందైనను ఈ త్రివ్యాహృతులుగల త్రిపుటి విశిష్టమైన ఫలమును చేకూర్చుటలో కడు సమర్థవంతమైనదిగా ఉన్నది. బ్రహ్మపురాణము - 'భువః ఇత్యన్తరిక్షమ్' అని దాని వలన అంతరిక్షసంబంధమగు సుఖములు కలుగునని తెలుపుచున్నది.

తైత్తరీయోపనిషత్తునందు 'భువః' యొక్క త్రిరూపములను గూర్చి ప్రముఖముగా తెలుపబడినది—

'భువః ఇత్యన్తరిక్షమ్ । భువః ఇతి వాయుః । భువః ఇత్యపానః ।'

అనగా—భువః అంతరిక్షము, భువః వాయువు. భువః అపానము - అని. అంతరిక్షమనుట ఎట్లన - విశాలమై ఉన్నందున వ్యాపకమై ఉన్నందున వాయువు శరీరమును సంరక్షించునదైనందున అపానము.

మహర్షి దయానందులు 'అపాన' శబ్దమును పరమేశ్వర వాచకమని అంగీకరించిరి. వారి అభిప్రాయము ఇది—

'యో ముముక్షూణాం ముక్తానాం స్వసేవకానాం ధర్మాత్మనానాం సర్వదుఃఖమపానయతి దూరీకరోతి సోఽపానో దయాళురీశ్వరోఽస్తి'.

—ముముక్షువులను, జీవన్ముక్తులను, ధర్మాత్ములైన తన సేవకులను సర్వదుఃఖములనుండి విడిపించి సుఖము నందించునో అట్టి దయామయుడగు పరమాత్ముడు 'అపానము' అనబడు చున్నాడు.

ఈ విధమున అపానము దుఃఖనివృత్తిని కలిగించునదిగా చెప్పబడినది. దీనితో మానవుల ఆరోగ్యమును గూర్చి కూడ సూచించుట జరిగినది. ఎందులకనగా శరీరమునందలి అపానము నియమితము మరియు వ్యవస్థితము అయి ఉన్నచో ఎటువంటి ఉదర వ్యాధులు సంభవించుటకు అవకాశం వుండదు. ఇందుచే అపానమును వశమందుంచుకొనుట అత్యంతావశ్యకము. సాధకుడు అపానమును వశపరచుకొన్నట్లయితే చిత్తము సాధనలో లీనమగును. అన్యథా ఉదరరోగ పీడితుడై ఉన్నచో చిత్తము దేని యందు లగ్నము కాజాలదు. దుఃఖము ఆవరించి వుండును.

అపానము అనుటలో మరొక అభిప్రాయముకూడ కలదు. గాయత్రీ ఉపాసకుడు ఉదర వికారపీడితుడు కాకూడదని. ఎందుకనగా ఉదరవికారమే సర్వరోగములకు, వాటి ఉత్పత్తికి మూల కారణము. కనుక ఉదరవికారములు కలుగనిచో ఇతర వ్యాధులు,

అన్యవికారములు జనించవు. ఇందువల్లనే గాయత్రీమంత్రము సర్వవ్యాధి ప్రశమనిగా ప్రస్తుతింపబడినది.

ఛాందోగ్య ఉపనిషత్తు హృదయ సంబంధమైన ఐదు రంధ్రములను ప్రతిపాదించుచున్నది. ఇవి శరీరమునగల ప్రాణము మొదలగు పంచవాయువులకు సంబంధింపబడివున్నవి. వీటిలోవ్యాన వాయువు దక్షిణఛిద్రమని అంటూ దానిని ఉపాసించు సాధకుడు తేజస్వి, శ్రేష్ఠాన్నభోక్త అగుననెను. త్రిశిఖ బ్రహ్మణోపనిషత్తు అభిప్రాయానుసారం - 'అపానమూర్ధ్వమాకృష్యోదుదరోపరిధారయేత్' - అనగా అపానవాయువును పైకిలాగి పైననే ధారణ చేయవలెను. ఈ సాధన మనస్సును స్వాధీనమునందుంచును.

ధ్యానబిన్దూపనిషత్తు ప్రకారం - ప్రాణము, అపానము ఇవి రెండునూ సమశక్తివంతములుగా ఉన్నవి. ప్రాణాపానములు రెండు పరస్పరం కలసిపోయినప్పుడు మనుష్యుడు అత్యంత శక్తిశాలి అగుచున్నాడు. 'అపానాత్కర్షతి ప్రాణోఽపానః ప్రాణాచ్చ కర్షతి (ధ్యా-బి-ఉ) అనగా అపానము ప్రాణమును లాగును. ప్రాణము అపానమును లాగును. ఇట్లు ప్రాణాపానముల కలయిక క్రియా యోగవిధులందు వర్ణింపబడినది. దీని అభ్యాసము వలన కుండలిని జాగృతం చేయుటలో సహాయకారియగును. అంతేగాక దానివలన దైహిక. భౌతిక, దుఃఖాభావము కలుగుచున్నది.

'భువః' అనునది ప్రజాపతి యొక్క దైవత్వమునకు కారణ మగుటవలన ఉపాసకులకుగల సంతానవాంఛనుగూడ నెర

వేర్పుచున్నది. దీనిశక్తి ప్రజ్ఞాసంజ్ఞకమైనది. ఇందుచే సాధకుడు ఈసాధనవల్ల శ్రేష్ఠమగు బుద్ధినిపొందును. ఇట్లు గాయత్రియందలి ఈ ద్వితీయ వ్యాహృతి సర్వమైన కోర్కెలను సిద్ధింప జేయును.

# తృతీయ వ్యాహృతి స్వః

గాయత్రికి గల మూడవ వ్యాహృతియగు 'స్వః' వలన కూడ పరబ్రహ్మమను అభిప్రాయము ప్రతిపాదింపబడుచున్నది. కొంతమంది ఆచార్యుల అభిప్రాయానుసారం దీనికి సుఖము, ఆనందము, బ్రహ్మము అను తాత్పర్యములు తెలియుచున్నవి. పెక్కండ్రు విజ్ఞుల అభిప్రాయానుసారం ఈ వ్యాహృతి సర్వవిధ సుఖములను చేకూర్చునది లేక పరమానంద ప్రాప్తిని కలిగించునదై ఉన్నది. కనుక దీనిని ఉపాసించు సాధకుడు ఇహపరలోకములు రెండింటియందును పరమానందము అనుభవించును.

తైత్తరీయోపనిషత్తు ప్రకారము 'సువరిత్య సౌ లోకః' అథవా 'సువరిత్యాదిత్య' లేక 'సువరితివ్యానః' 'స్వః' అంటే స్వర్గలోకము అథవా ఆదిత్యుడు లేక 'స్వ' వ్యానవాయువు దీని యౌగికార్థములు - ఇది సుఖదాత అయినందున ఆదిత్యుడు మరియు చేష్టచేయునదిగాన వ్యానవాయువు — అని.

మహర్షి దయానందులుగూడ 'స్వః'కు అర్థం వివరించే సందర్భమున వ్యానవాయువును ప్రతిపాదిస్తూ ఇట్లన్నారు—

'యదభివ్యాప్య ధ్యానయతి చేష్టయతి ప్రాణాది సకల జగత్ స వ్యానః సర్వాధిష్ఠానం బృహద్ బ్రహ్మేతి ఖల్వేవం స్వః శబ్దార్థోఽసీతి వక్తవ్యమ్'

—ఏదైతే విశ్వమున అంతటను వ్యాప్తమై ఉన్నదో అట్టి వ్యానవాయువు ప్రాణులన్నింటిని నియమబద్ధముగా ఉంచుచూ పని (వ్యాపారము) చేయించుచున్నది. అది అన్నింటియందున అధిష్ఠానమై వున్న బృహద్ బ్రహ్మమే. ఇందుచేతనే ఆ పరబ్రహ్మమైన పరమాత్మను 'స్వః' అనుచున్నారు.

ఛాందోగ్యపు అభిప్రాయానుసారం వ్యానము దక్షిణచ్ఛిద్రము దానిని ఉపాసించు సాధకుడు యశస్వి, శ్రీమంతుడు అగును. వ్యానవాయువు ఏయే అంగములందు వుండవలెనవి నిర్ణయింపబడినచో ఆయా అంగములందు అది సహజరూపముననే ఉన్నచో మనుష్యుడు ఆరోగ్యవంతుడై ప్రసన్నచిత్తునిగా ఉండును. వ్యానవాయువు వుండవలసిన ఆయా అవయవములు ఇట్లున్నవి—

"వ్యానః శ్రోత్రోరు కట్యాం చ గుల్ఫస్కంధ గలేషు చ (త్రిశిఖ బ్రాహ్మణము) అనగా వ్యానవాయువు (శరీరమున) చెవులు, తొడలు, నడుము, చీలమండలు, భుజములు, గళమునందు ఉండును. ఆరోగ్యముదృష్ట్యా దీనిసాధన అవయవ పుష్టినిచ్చును. ఈ అవయవములు పుష్టిగా వున్నచో మానవుడు శారీరకముగ సుఖవంతుడై ఉండును. అన్యథా ఎటువంటి సుఖమును పొందజాలడు.

యోగక్రియల ద్వారా అన్నివాయువులను (5 + 5 = 10) ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన మరియు ఉపవాయువు లైన నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయములు) వ్యవస్థితములుగా వుండవచ్చును. వీటిలో వ్యానవాయువు కూడ ఒకటిగా ఉన్నది. వీటిని అదుపు చేయుచూ దీర్ఘజీవితము తప్పక గడుపవచ్చును. యోగచూడామణ్యూపనిషత్తున వ్యానవాయువు శరీరమందంతట కలదని వివరింపబడినది. (వ్యానః సర్వ శరీరే) ఇందువలన వ్యానవాయువును సిద్ధింపజేసుకొనుట చాలా అవసరమని తెలియుచున్నది.

'స్వః' సంజ్ఞకమైన ఈ వ్యాహృతికి చంద్రుడు దైవతము. చంద్రునకు పర్యాయము సోముడు. ఆతనిలో సౌమ్యగుణము ఉన్నది. దీనిని ఉపాసించుటవలన సాధకునిలో సౌమ్యగుణము ఆవిర్భవించును. 'స్వః,కు గల శక్తికి 'విశ్వభద్రా' అని పేరు. ఈ శక్తి ప్రపంచమునకు శుభదాయిని అయినందున సాధకునకు నిరంతరం శ్రేయస్సును చేకూర్చుచుండును.

శాస్త్రములందు జీవాత్మ, పరమాత్మల ఏకత్వము ప్రతిపాదింపబడినది. అయిననూ పరమాత్మ సర్వవిధ పరిపూర్ణుడు కాగా జీవాత్మ అపూర్ణుడు. జీవాత్మ అనేక విధములగు కష్టములకు లోనగుట ఆతని అపరిపూర్ణత వల్లనే కలుగుచున్నది. సుఖదుఃఖములు రెండూ మనుష్యులను ప్రభావితం చేయుచున్నవి. సుఖదు,ఖములు రెండును ధరిత్రికిగల గుణములు. ఇందువలననే

అత్యంత సుఖవంతులుగా కనబడు మనుష్యులునూ ఏదో ఒక దుఃఖముతో దుఃఖితులై ఉంటున్నారు.

జీవాత్మ దుఃఖమందుటకుగల కారణములగూర్చి ఆలోచించి నట్లయితే ఆతనిలో ఆనందగుణభావము కలదని స్పష్టమగుచున్నది. ఆత్మ సత్ - చిత్ - ఆనందముఖ కలదై వుంటే జీవాత్మ సత్ - చిత్ - గా మాత్రమే ఉన్నది. ఒకవేళ అదియును ఆనంద యుక్తమై ఉన్నచో పరమాత్మకు ఏమాత్రం తీసిపోకుండెడిది. ఆనందాభావమువల్లనే దానిని అపూర్ణము - అనుట జరుగు చున్నది.

ఇచ్చట ఒక సందేహం కలుగుచున్నది - జీవాత్మ, పర మాత్మ అభేదమైనప్పుడు లేక జీవ పరమాత్మలు ఏకాంశమైనప్పుడు దానిలో ఆనందభావం ఎట్లు కలుగుచున్నది ? అని. ఇందుకు సమాధానం - జీవాత్మలో కూడ ఆనందాభావము లేనప్పటికి జీవాత్మ మాయా పరిచ్ఛిన్నుడగుటవలన ఆనందము మరుగైనది.

ఇందుచే ఆనంద గుణమును తెలియజేయు అవసరం కలిగి నది. పరమాత్మతో ఐక్యము స్థాపించుటకు గాయత్రి సాధన చెయవలయును. దానికి 'స్వః' అను వ్యాహృతి ఉన్నది. అది సాధకునిలో ఆనంద గుణమును వ్యక్తపరచుటలో సమర్థమై వున్నది.

ఇందుచే గాయత్రీ ఉపాసకుడు పరమాత్మను ఆనందము నకై యాచించును. అతడు సుఖములందుగాక ఆనందమును

యాచించును. సుఖము. ఆనందము ఈ రెండింటికి చాలా వ్యత్యాసము ఉన్నది. సుఖమనగా భౌతిక దుఃఖముల అభావం. కాని జీవుడు చేసిన కర్మలు శేషించి వున్నంతవరకు అట్టి అభావం సాధ్యంకాదు. కర్మలను పూర్తిగా నిశ్శేషము జేసినప్పుడే అది లభించును. ఇప్పుడు మరొక ప్రశ్న - కర్మ నిశ్శేషము అగుట ఎట్లు ? అని. అనుభవించకుండా ఏ కర్మయును తీరుట అసంభవం. ఒకవేళ అటువంటిది సంభవమైనప్పటికి అది గాయత్రీ ఉపాసన వల్లనే జరుగును. ఇందుచే ఆ ఉపాసనలో 'స్వః' వ్యాహృతిని చేర్చుటవలన దుఃఖ నివృత్తి చాలావరకు సాధ్యమగును. సరస్వతీ రహస్యోపనిషత్తునందు కర్మక్షయము, ఆనందప్రాప్తికి గల విధానమున సంకేతరూపముగా తెలియజేయుచూ ఇట్లు చెప్పబడినది___

శ్లో॥ దేహాభిమానే గలితే విజ్ఞాంతే పరమాత్మనే ।
యత్రతత్ర మనోయాతి తత్ర పరామృతమ్ ॥
భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వ సంశయాః ।
క్షీయన్తే చాస్య కర్మణి తస్మిన్దృష్టే పరావరే ॥

___ శారీరకమగు అహంభావము నశించి పరమాత్మ తత్వానుభూతి కలిగినప్పుడే ఇటూ - అటూ తిరుగాడే మనసు అచ్చటనే ఆ శ్రేష్ఠ అమృతత్వమును అనుభవించుచూ ఆనందమును పొందును. ఆ స్థితిలో సర్వ సంశయములు తొలగి హృదయ

గ్రంథులు తెరచుకొనును. మరియు బ్రహ్మసాక్షాత్కారము అగుట వలన సర్వ కర్మలు క్షయమగును.

ఇందువలన కర్మక్షయ మనునది రెండు విధములుగా కలుగునని తెలియుచున్నది. 1. భోగించుటవలన, 2. బ్రహ్మ సాక్షాత్కారము వలన. భోగించుటలో సుఖ దుఃఖములు రెండింటిని అనుభవింపవలసి వచ్చుచున్నది. కాని బ్రహ్మసాక్షాత్కారము నందు కేవలానందమే కలదు. దీనిలో దుఃఖ మనునది పేరునకు కూడ లేదు.

కొందరు సందేహిస్తుంటారు - బ్రహ్మసాక్షాత్కారము కూడ సహజ కార్యమేమియును కాదని. ఆ స్థాయికి చేరుకొనులోపల జప - తప - వ్రతాదులగు సాధనలందు బాహ్యకష్టములు అనుభవింపవలసి వచ్చును. ఇట్లయ్యును బ్రహ్మ సాక్షాత్కారమను సౌభాగ్యము పొందగలిగినవారు అతి తక్కువగా వుంటారు. ఈ సందేహమును తీర్చుట కష్టమైన పనేమీ కాదు. ఏలన జప - తప - వ్రతాదులవల్ల ఎటువంటి కష్టములు కలుగవు. ఒకవేళ అట్టివి కష్టజనితములని తలంచిననూ వాటిని దుఃఖప్రదములుగా తలంపవలదు. అంతేగాక వాటిని ప్రారంభించినప్పటి నుండియే కర్మక్షయము ఆరంభమగును. మనుష్యుడు పరమాత్మ జ్ఞానాభిముఖుడై సాగిపోవుకొలది అతని దుఃఖములు అంతరించుచుండును. పరమాత్మ జ్ఞానప్రాప్తిని కలిగించుటలో 'స్వః' అను వ్యాహృతి కూడ సహాయపడుచున్నది.

ఈ విధమున 'స్వః' అనగా దుఃఖ నివృత్తిని కలిగించి సుఖము లేక ఆనందము చేకూర్చునదని అర్థమగుచున్నది. ఈ మూడు వ్యాహృతులు 'భూః' 'భువః' 'స్వః' యొక్క మిశ్రితార్థం—ప్రాణమునకు స్థానం, ప్రాణాధీశ్వరుడు, దుఃఖక్షయమును కలిగించునది, సుఖదాయికమైనది, సత్ - చిత్ - ఆనందమైన బ్రహ్మము లేక అనంతగుణ సంపన్నుడైన పరమాత్మ, లేక పృథ్వీ, ఆకాశము, స్వర్గములను త్రివిధ లోక సమన్వితమగు సృష్టి. దీనిలో బ్రహ్మ సర్వాత్మ స్వరూపుడై వున్నందున పరబ్రహ్మ స్వరూపమైన ఈశ్వరుడే రాజిల్లుచున్నాడు - అని. ఈ భావనతోనే ఈ త్రివిధ వ్యాహృతుల జపమునందు లీనము కావలసి యున్నది.

— * —

# తత్ - శబ్ద రహస్యము

## 'తత్' మరియు పరబ్రహ్మముల అభేదత్వ నిరూపణము

గాయత్రీ మంత్రమునందు వ్యాహృతుల తరువాత 'తత్' శబ్దమే ప్రయోగమైనది. కనుక గాయత్రీ మంత్రము ఈ శబ్దముతోనే ప్రారంభమైనదనిన అసత్యం కానేరదు. కనుక ఈ శబ్దపు మహత్తును ఏ విధమున జూచినా తక్కువైనదేమి కాదు. శాస్త్రములు దీనిని పరబ్రహ్మ వాచకమని గుర్తించినవి. ఎట్లన—

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥ (గీత-4-34)

'ఓం తత్ సత్' ఈ త్రివిధ నామములతో బ్రహ్మము నిర్దేశింపబడుచున్నది. అనగా బ్రహ్మమే 'ఓం'. బ్రహ్మమే 'తత్', బ్రహ్మమే 'సత్' అని ఎరుక చేయబడుచున్నది. తొలు దొలుత సృష్ట్యాదిలో బ్రహ్మ "ఓం తత్ సత్" అని పలికి వేదములను. బ్రాహ్మణులను, యజ్ఞములను సృష్టించెను.

శ్లో॥ తత్ ద్వితీయేకవచనమనేఽఖిల వస్తునః ।
సృష్ట్యాది కారణం తేజో రూపమాదిత్య మణ్డలే ॥
అభిధ్యేయం సదానన్దం పరబ్రహ్మాఽభిదీవతే ।
యత్తు సవితు రిత్యుక్తం షష్ఠ్యేక వచనాత్మకమ్ ॥
(ప్రపంచసార తంత్రము.)

—'తత్ శబ్దము ద్వితీయా వచనమునకు చెందినది. ప్రపంచమునందలి సమస్త పదార్థోత్పత్తికి ప్రథమ కారణమై ఉన్నదని అర్థం. ఆదిత్య మండలమున గల తేజస్వరూపము. సదానంద స్వరూపుడు అయిన ఏ పరబ్రహ్మము కలదో దానిని ధ్యానించు నిమిత్తమే 'తత్' శబ్ద ప్రయోగము జరిగినది. ఏదైతే తత్' రూపమున కలదో అదే సత్యరూపమున కూడ ఉన్నది.

తదిది ద్వితీయైక వచనమ్, అనేనాఖిల జగదుత్పత్తి స్థితి లయ కారణభూత ముపనిషది కథ్యమానం నిరుపమ తేజః సూర్య మణ్డలాభిధ్యేయం పరబ్రహ్మాభిధీయతే । (భరద్వాజ - గా. భా.)

'తత్' ద్వితీయాకు చెందిన ఏకవచనము. దీనివలన ఉపనిషత్తులందు పర్ణింపబడినది. సూర్యమండలస్థమై ఉన్న తేజస్సు ఈ సంపూర్ణ విశ్వోత్పత్తికి, దాని స్థితి, వినాశనములకు కారణభూతమగుచూ అదే తేజస్సు పరబ్రహ్మ రూపమున సిద్ధించుచున్నది.

శ్లో॥ తచ్ఛబ్దేన తు యచ్ఛబ్దో బోద్ధవ్యః సతతం బుధైః ।
ఉదాహృ తేతే యచ్ఛబ్దేః తచ్ఛబ్దః ఉదితో భవేత్ ॥

(యాజ్ఞవల్క్య - గా. భా.)

—తత్ శబ్దము వలన సతతము 'యత్' శబ్దము తెలియవచ్చుటనే విద్వజ్జనులు అంగీకరించుచున్నారు. ఇట్లే 'యత్' శబ్దముతో 'తత్' శబ్దము ఆవిర్భావిత మగుచున్నది.

తచ్ఛబ్ద శ్రుతేర్య చ్ఛబ్దోఽధ్యాహారార్థః ।

(వరదరాజ - గా. భా.)

—'తత్' శబ్దమును వినుటవలన 'యత్' శబ్దార్థము తెలియుచున్నది.

తచ్ఛబ్దేన ప్రత్యగ్భూతం స్వతః సిద్ధం పరబ్రహ్మోచ్యతే ।

(శంకరులు - గా. భా.)

'తత్' శబ్దమే ప్రత్యగ్భూతము, స్వతః ప్రత్యక్షమువనున్న పరబ్రహ్మ మనబడుచున్నది. ('తత్' శబ్దమే ప్రత్యక్ష పరబ్రహ్మమై వున్నది.

తచ్ఛబ్దః స్వబుద్ధిః భేదకృతః అతిదూరతమే అత్యుత్కర్షా ఖ్యేఽర్థే వర్తతే । (విష్ణు గా. భా.)

'తత్' మన బుద్ధి భేదముతో చెప్పబడు అర్థంకంటే అత్యంత దూరము, అత్యంత ఉత్కర్షము నగు అర్థయుక్తమై వున్నది.

శ్లో॥ తదితి వాక్ మనోగమ్యధ్యేయం యత్సూర్యమండలే ।
సవితుః వాక్ సకలోత్పత్తి స్థితి సహారకారణమ్ ॥
(విద్యారణ్య - గా. భా.)

'తత్' మనస్సునకు, వాక్కునకు అగమ్యము, విశ్వమంతటికి ఉత్పత్తి - స్థితి - సంహారక కారణమై ఉన్నది. 'తత్' (అ) సూర్యమండలమున విద్యమానుడై ఉన్న (తేజోమయుడు) బ్రహ్మమును ధ్యానించెదముగాత !

అదితి దదసౌ తేజోమయం తేజోఽనిగ్నదేవతా ।
గాయత్రీ రహస్యోపనిషత్తు)

'తత్' శబ్దము తేజోమయం. అందుగల తేజస్సు అగ్ని దేవత యొక్క రూపమై ఉన్నది.

తదతి అవ్యయాం పరీక్షార్థే । (సంధ్యా భాష్యము)

—'తత్' శబ్దము పరీక్ష అర్థంలో అవ్యయము (అవినాశి. బ్రహ్మము)ను తెలియజేయుచున్నది.

ఈ విధమున మహర్షులు తమతమ అభిప్రాయానుసారము 'తత్' శబ్దమును బ్రహ్మవాచకమని అంగీకరిస్తూ భిన్నరీతులలో వ్యక్తీకరించి వున్నారు. అట్లయికూడ వాటన్నింటి సారాంశము 'తత్' శబ్దము ఆత్మబోధకమై ఉన్నది - అనుటయే.

## త్రిగుణాత్మకమైన - 'తత్'

వస్తుతః 'తత్' శబ్దమునకు గల అర్థం—అతను. అది - అని. అతను ఎవరు ? పరమ తేజోమయుడైన సూర్యుడు - అని అథవా ఎవరో మరొకరు. గాయత్రీ మంత్రానుసారం - తత్కారం చమ్పకా పీతం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్, అనగా 'తత్' శబ్దము చంపా పుష్పమువలె పీతవర్ణము కలిగినదై బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపమై వున్నది. దీని అభిప్రాయము - దీనిలో త్రివిధ మహాదేవతలు కూడి ఉన్నారు అని లేక బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అనే త్రిదేవతలను ఈ 'తత్' శబ్దము తెలియజేయు చున్నది - అని. 'పరమ్య బ్రహ్మణో రూప తకారం త్రిగుణాత్మకమ్' అంటే 'తత్' శబ్దము పరబ్రహ్మము యొక్క త్రిగుణాత్మక (సత్ - చిత్ - ఆనంద్) స్వరూపమై వున్నది - అని.

ఈ విశ్వం త్రిగుణాత్మకము. జీవుల శరీరములును సత్వ - రజ - తమోగుణ యుక్తములే, మహర్షులు 'తత్'ను గూడ త్రిగుణాత్మక మనిరి. ఇందుచే ఇదియునూ జగద్రూప మనియే నిరూపిత మగుచున్నది.

నిరాకారుడు సత్వాదిగుణరహితునిగా వుండును. కనుక ఆయనను గుణాతీతుడు అనుచున్నారు. 'తత్' శబ్దము త్రివిధ గుణ సమన్వితము. ఇందుచే దానికిగల బ్రహ్మత్వము సగుణమై వుండవచ్చును. ఈ విధమున 'తత్' శబ్దము సగుణబ్రహ్మ రూపమై వున్నది. ఇందువలన కూడ గాయత్రీ మంత్రమునందు సగుణ, నిర్గుణములైన ద్వివిధోపాసనలు కూడి వున్నవి. అన్న పూర్ణోపనిషత్తున యిట్లున్నది—

శ్లో॥ యదిద దృశ్యతే కిచిద్ తత్తన్నాస్తీతి భావయ ।
యథా గన్ధర్వనగరం యథా వారి మరుస్థలే ॥

గంధర్వ నగరం లేనట్లే ఎడారిలో నీరులేని విధమున ఈ దృగ్గోచర మగుచున్నదంతయు (జగద్రూపము) ను 'తత్' తప్ప మరే యితరము కాదు.

కాని మాయావృతమై వున్నందున తద్రూపత కనబడుట లేదు. వర్తమానమున కనబడుచున్న రూపమునే నిజమైనదిగా తలంచుట జరుగుచున్నది. వెండి, బంగారు, రాగి, ఇత్తడి మొదలగు వాటితో చేయబడిన పాత్రలు లేక ఆభరణములను మట్టి, దుమ్ము గల చోట అశ్రద్ధగా చాలాకాలం పడి వుండనిచ్చినచో వాటిపై నంతటను మురికి కూడి వాటి నిజరూపము మరుగు పడును. ఆ స్థితిలో వాటిని ప్రకాశింపజేయుటకని అట్టివాటిని తోమవలసి వచ్చును. కరిగింపవలసి వచ్చును. వాటిని తోముట లేక కరిగించుట చేయనంతవరకు వాటి నిజరూపము కనబడదు.

## గాయత్రి ద్వారా 'తత్' బ్రహ్మ మార్జనము :-

ఇట్లే బ్రహ్మమునుగూడ శుభ్రపరచుట చాల అవసరం. దానిని శుభ్రపరచనంతవరకు దాని అసద్ రూపమే (మిథ్యా రూపమే) కనబడుచుండును. ఈ విద్యా విషయమును గూర్చి అన్నపూర్ణోపనిషత్తు బహు స్పష్టముగా చెప్పినది—

శ్లో॥ పూర్వదృష్టమదృష్టం వా యదస్యాః ప్రతిభాసతే ।
సంవిదస్తతు ప్రయత్నేన మార్జనీయం విజానతా ॥
తదమార్జనమాత్రం హి మహాసంసారతాం గతమ్ ।
ప్రత్యమార్జనమాత్రే తు మోక్ష ఇత్యభిధీయతే ॥

— పూర్వమునందు చూచియున్ననూ చూడనిదానివలె కనబడు 'తత్' ను ప్రయత్నపూర్వకముగా మార్జనము చేయవలెను. ఎందుకనగా 'తత్' ను పూర్తిగా తెలుసుకొనకుండుట వలననే ఆయనను ప్రాపంచికునిగా చేయుచున్నది. కాన 'తత్' ను గూర్చి పూర్తిగా తెలుసుకొనుటయే మోక్షమని చెప్పబడుచున్నది.

ఇందుచే 'తత్' ను పరిపూర్ణముగా గ్రహించుట వలననే బ్రహ్మప్రాప్తి కలుగుచున్నది. దానిని పూర్తిగా గ్రహించుటకు గాయత్రీ మంత్రమును మించిన సాధన వేరొండు లేదు.

# గాయత్రీమంత్రమునకు ప్రాణం—సవితుః

## సవితుః యొక్క అద్వితీయ ప్రభావము :-

గాయత్రీ మంత్రమునందు 'తత్' తరువాత 'సవితుః' శబ్ద ప్రయోగము ఉన్నది. ఈ శబ్దముకూడ ఒంటరిగనే తన అద్భుతమైన ప్రభావముతో నిండి ఉన్నది. ఇది పూర్తి మంత్రముతో వాడబడినప్పుడు దీని విషయమై చెప్పవలసినది యేమున్నది? మొదటి దగు తన స్వశక్తి రెండవదైన మంత్రశక్తి ఇవి రెండు కలయుటవలన శక్తి ఇనుమడించుట సహజముగా జరుగును. అచార్యులు దీని మాహాత్మ్యమును గూర్చి తమ అనుభవాను సారము వివిధ రీతులలో వ్యక్తీకరించి ఉన్నారు—

'సవితుః' జగతాం ప్రసవితుః సవితా వై ప్రసవానామీశే। ఉత్తమేర్చి షే ప్రసవస్య స్వమేకః ఇత్యాది శ్రుతే।

(వరదరాజ - గా. భా.)

జగత్తును సృష్టించునదే 'సవిత', అది సృష్టికి, సృష్టి యగుచున్నవాటికి లేక ఉత్పన్న మగుచున్నవాటికి ఈశ్వరునిగా ఉన్నది. (ఓ సవితా దైవమా) నీవు సృష్టికర్తలలో/ఉత్పన్నము చేయువారలలో) ఒకడవు. మరియు సర్వశ్రేష్ఠుడవై ఉన్నావు.

సవితురితి షష్ఠిఏకవచనం। షూఞ్ ప్రాణి ప్రసవే। ఇత్యస్య ధాతోరేతద్రూపమ్। సర్వస్య భూతజాతస్య ప్రసవితురీత్యర్థః।

'సవితా' షష్ఠీ ఏకవచనము. ఇది షూఙ ధాతువులో ఏర్ప డినది. ఈ ధాతువు ప్రాణులకు సంబంధించిన అర్థంలో ప్రసవ వాచకము. ఇందువల్లనే ఈ రూపము కలుగుచున్నది. కనుక దీనికి సర్వభూతములకు ఉత్పత్తికర్త అనే అర్థం కలిగినది.

షూ ప్రేరణే, సూయతి ప్రేరయతీతి। సవితా సూర్యః తత్సమ్బన్ధి సూర్యమండలావచ్ఛిన్నమితి యావత్। దీప్యతీతి దేవః పరమాత్మా। (భట్టోజీ దీక్షిత్ - గా. భా.)

'షూ' ధాతువు ప్రేరణావాచకము. ప్రేరణాయుక్తు డగుట వలననే సూర్యుని 'సవిత' అంటారు. ప్రకాశించుటవలన అతనికి దైవము అనే పేరు కలిగినది. ఆ సవితా దైవమే పరమాత్ముడు.

హిరణ్యయేనా పాత్రేణ సత్యస్యాసహిత ముఖమ్।
యా౽సావిత్యేవ పురుషః సో౽సావహమ్। (మైత్రుపనిషత్తు)

— సత్య స్వరూపుడైన ఆ బ్రహ్మ ముఖము తేజోమయ పాత్రచే కప్పబడి ఉన్నది. నేను కూడ ఆ తేజోవంతమైన సవి తయే అయి ఉన్నాను.

య ఏషోరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే।
హిరిణ్యమశ్రు హిరణ్య కే ఆప్రాభాత్సర్వ ఏవ సువర్ణా।
(ఛాన్దోగ్యోపనిషత్)

— ఆదిత్య మండలము నుండి ఏ హిరణ్మయ పురుషుడు కనబడుచున్నాడో అతను బంగారు గడ్డము, బంగారు మీస

ములు కలిగి పాదములనుండి శిఖా పర్యంతము స్వర్ణమయుడై వెలుగొందుచున్నాడు.

షుజ ప్రాణి ప్రసవే ఇత్యస్య ధాతారేతద్రూపమ్, సునోతి సూయతే వా ఉత్పాదయతి చరాచరం జగత్ । సవితా సూర్యమండలాంతర్గత పురుష ఈశ్వర । (భారద్వాజ - గా. భా.)

— ప్రాణులను సృజించునట్టి ఈ సవితా రూపము షుజ ధాతువుతో నిర్మాణమైనది. చరాచర జగత్తును ఉత్పన్నము చేయునట్టి ఆ సవిత సూర్యమండలాంతర్గతమున ఈ సూర్యుని రూపమున విద్యమానమై ఉన్నది.

సు ప్రేరణే సువతీ స్వవ్యాపారే ప్రేరయతీ । యః స సవితా ప్రేరకాన్తర్యామి విజ్ఞానానన్ద స్వభావో హిరణ్యగర్భోపాధ్యచ్ఛిన్న । (మహీధర్ - గా. భా.)

— ప్రేరణార్థకమైన సవిత 'సు' ధాతువుతో ఏర్పడినది. కాన సర్వభూతములను వాటి స్వాభావికమగు కార్యములందు ప్రేరిత మొనర్చునది-సవిత, అదియే ప్రాణులకు ప్రేరకము. వాటిలో అంతర్యామి రూపమున విద్యమానమై ఉన్న సవిత విజ్ఞానం. స్వయముగ భావరూపాత్మకమగు ఆనందము, హిరణ్యగర్భము మరియు అవిచ్ఛిన్నము అయి ఉన్నది.

నమః సవితో జగదేకచక్షుషే జగత్ప్రసూతి స్థితినాశహేతవే । త్రయోమయాయ త్రిగుణాత్మధారణే విరచి నారాయణ శంకరాత్మనే । (భవిష్య పురాణము)

—— విశ్వమునకు ఒక నేత్రం, విశ్వోత్పత్తి - స్థితి - నాశములకు కారణము, త్రిదేవమయము, త్రిగుణాత్మక బ్రహ్మ, నారాయణుడు మరియు శివ స్వరూపుడు అయిన సవితా దైవమునకు నమస్కారము.

చన్ద్రమా సవితా ప్రాణ ఏవం సవితా విద్యుదేవ సవితా ।

(గోపథ బ్రాహ్మణము)

—— చంద్రుడు సవిత, ప్రాణము సవిత, విద్యుత్తు సవిత, చంద్రుడు, ప్రాణము, విద్యుత్తు ఈ మూడును సూర్యుని స్వరూపములే అని అభిప్రాయము.

సూతే సకల శ్రేయాంసి ధాతౄణాం ఇతి సవితా ।

(సన్ధ్యా - గా. భా.)

—— ఎవరైతే ధ్యాతయొక్క సర్వ శుభములను ధారణ చేయునో అతనే సవిత.

'సవితా వే ప్రసవనా మీశే' (కృష్ణయజుర్వేదము)

—— సవితయే ఉత్పన్నమైన ప్రాణులన్నింటికి ఏకైక ఈశ్వరుడై ఉన్నాడు.

'తదక్షరం తత్సవితు ర్వరేణ్యమ్' (శ్వేతాశ్వర)

సవితయే అక్షరము (అవినాశమైనది). దాని తేజస్సు గ్రహణయోగ్యమై ఉన్నది.

'ఏషహి ఖల్వాత్మా సవిత' (మైత్ర్యు. ఫు.)

— సవితా దైవమే సర్వప్రాణులందు ఆత్మరూపునిగా ఉన్నాడు.

'దేవోఽయం భగవాన్భానురన్తర్యామీ సనాతనః'

(సూర్యపురాణము)

— భగవంతుడగు ఆ భాస్కరుడే సర్వప్రాణులందు అంతర్యామి రూపమున గల సనాతన దైవమై ఉన్నాడు.

'అసౌ వ దేవః సవితేతి' (శతపథ బ్రాహ్మణము)

— ఈ సవితయే పరమాత్మయగు దైవమై ఉన్నాడు.

'సంరక్షితం చ భూతానాం సవితా చ తతః స్మృతః'

(వృ. యో. యా జ్ఞ.)

— సర్వ భూతములను రక్షించునదిగాన దానిని 'సవిత' అనుచున్నారు.

'సవితా వై సర్వస్య ప్రసవితా అగ్నిః సవితారమ్ సర్వస్య ప్రసావితరమ్' (నిరుక్త దైవతకాణ్డ)

— సవితయే సర్వప్రాణుల ఉత్పత్తికి కారణమై ఉన్నది. సవిత అగ్ని, అగ్నియే ప్రపంచమునందలి సర్వభావముల ఉత్పత్తికి కారణ మగుచున్నది.

శ్లో॥ సవితా సర్వ భూతానాం సర్వ భావాంశ్చ సూయతే।
సర్వానాం ప్రేరణాచ్చైవ సవితా తేన చాచ్యతే ॥

(వృ. యో. యా.)

— సర్వప్రాణుల, సకల పదార్థముల ఉత్పత్తికి కారణమగుచున్నది సవితయే. అదియే అన్నింటికి ప్రేరణ కలిగించుచున్నది. కనుక దానిని 'సవిత' అనుచున్నారు.

శ్లో॥ ధాతోరిహ వినిష్పన్న ప్రాణిప్రసవ వాచక్రాత్ ।
సర్వానాం ప్రాణిజాతీనామితి ప్రసవితుః సదా ॥
(ప్రపంచసార తంత్రము.)

— ఆయన ప్రాణులను సృజించువాడు మరియు ధాతయును అయి ఉన్నాడు. ఆయన ద్వారా సర్వభూత ప్రసవము జరుగున్న కారణముననే ఆయనను సవిత అనుచున్నారు.

శ్లో॥ యో దేవః సవితాఽస్మాకం ధియో ధర్మాదిగోచరాః ।
ప్రేరయేత్తస్య యం భర్గస్తం వరేణ్య ముపాస్మహే ॥
(అగస్త. - గా. భా.)

— ఏ సవితా దైవమైతే మన బుద్ధిని ధర్మప్రవృత్తములగు ఇంద్రియములతో సంయుక్త మొనర్చుచున్నాడో ఆ ప్రేరణాత్మక దైవముయొక్క గ్రహణీయమైన తేజస్సును మనము ఉపాసించుచున్నాము.

శ్లో॥ దేవస్య ద్యోతమానస్య హ్యానన్దాత్క్రీడితోఽపివా ।
ధీమహ్యాహం స ఏవేతి తేనైవాభేద సిద్ధయే ॥
(విద్యారణ్య - గా. భా.)

— ప్రకాశమానుడు, ఆనందాత్మక రూపమున క్రీడించు

చున్న దేవత పేరే 'సవిత', ఆయనయే బుద్ధిప్రేరకుడై ఉన్నాడని భావించుచూ అభేద స్థితిని పొందెదముగాత.

శ్లో॥ సూర్యాద్ భవన్తి భూతాని సూర్యేణ పాలితాన తు।
సూర్యే లయం ప్రాప్నువంతి యః సూర్యే సోఽహ
మేవ చ ॥ (సూర్యోపనిషత్తు)

— సూర్యుని వలననే సమస్త భూతోత్పత్తి జరుగు చున్నది. ఇటువంటి సూర్య రూపము నేనే అయి ఉన్నాను. (సృష్ట్యారంభము, స్థితి, వినాశములకు కారణముగా ఉన్నందున నేనే సూర్యుడనై ఉన్నాను.)

శ్లో॥ అగ్న్యాదిరూపీ విష్ణుర్హిం వేదాదీ బ్రహ్మగీయతే।
తత్పదం పరమం విష్ణోర్దేవస్య సవితః స్మృతమ్ ॥
(అగ్నిపురాణము)

— వేదాదియందు అగ్ని ఆదిగా గల రూపమున విష్ణు బ్రహ్మ మొదలగు రూపములు ఏవైతే చెప్పబడినవో అవియే సవితా దైవమగు విష్ణువుని పరమ పదములుగా చెప్పబడుచున్నవి.

శ్లో॥ సత్యా సూర్య పరధామ ఋగ్యజుః సామరూపిణీమ్।
ప్రజ్ఞానాయాఖిలేశాయ సప్తాశ్వాయ త్రిమూర్తయే ॥
(సూర్యపురాణము)

— ఆ యా పుణ్యస్థానముల స్వరూపుడు, ఋగ్యజుస్సామ వేదరూపుడు, ప్రజ్ఞాన రూపుడు, అఖిల విశ్వమునకు ఈశ్వ

రుడునై, సప్తాశ్వముల (సూర్యునికి గల సప్తవర్ణములే సప్తాశ్వములు) నధిరోహించినవాడు, బ్రహ్మ, విష్ణు - మహేశ్వరుల రూపమున ఉన్న ఆ సూర్యభగవానునికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ హృదయాకాశే తు యో జీవః సాధకై రుపగీయతే ।
స యేవాదిత్యరూపేణ బహిర్నమసి రాజతే ॥

(వ్యాసుడు)

— హృదయాకాశమునందు విద్యమానుడై ఉన్న ఏ ఆత్మనైతే సాధకులు ధ్యానించుచున్నారో, అదే ఆదిత్యుని రూపమున వెలుపల ప్రకాశమందు దీపించుచున్నది.

శ్లో॥ ఏషః భూతాత్మకో దేవః సూక్ష్మోఽవ్యక్తః సనాతనః ।
ఈశ్వరీయః సర్వభూతానాం పరమేష్ఠీ ప్రజాపతిః ॥

(భవిష్య పురాణము)

— ఈ సవితా దైవము భూతాత్మకుడు, సూక్ష్ముడు, అవ్యక్తుడు. సనాతనుడు. సర్వప్రాణులకు ఈశ్వరుడు, పరమేష్ఠియనగు ప్రజాపతి అయి ఉన్నాడు.

పై ఉదాహరణములవల్ల సవిత, సూర్యుడు, ఆదిత్యుడు - ఆదిత్యునకు తేడా లేదని సవితకు అర్థం సూర్యుడేనని విదితమగుచున్నది. కాని 'సవిత' చాలా వ్యాపకార్థం కలిగినదని, దాని అర్థం. సూర్యుడు మాత్రమే కాదనినచో ఇట్టిది అత్యుక్తి కాజాలదు. సావిత్ర్యుపనిషత్తున 'సవిత'కు అనేక అర్థములు

చెప్పబడినవి. వాటిలో 'క' సవితా కా సావిత్రీ? అని పలుమారులు - సవితా అని దేని నంటారు సావిత్రీ? అని దేనిని - ప్రశ్నింపబడినది. దానికి జవాబుగా 'అగ్నిదేవ సవితా పృథ్వీ సావిత్రీ స యత్రాగ్ని స్తత్ పృథ్వీ యత్ర వా పృథ్వీ తత్రాగ్ని స్తే ద్వ యోనితదేకం మిథూనమ్' అనగా అగ్ని సవిత మరియు పృథ్వి సావిత్రి, అగ్ని ఉన్నచోటనే పృథ్వియును ఉన్నది. పృథ్విగల చోటునసే అగ్నియును కలదు. ఆ రెండు ఒక యోని - అనగా ప్రపంచమునకు జన్మదాత, అవి రెండూ ఒక యుగ్మము - అని చెప్పబడినది.

దీని తరువాత మరల 'కః' సవితా కా సావిత్రీ? అనంటూ ప్రశ్న పునశ్చరణ చేయబడుట ఇందుకు జవాబుగా వరుణుడు సవిత యని జలము సావిత్రి యని - చెప్పబడినది. ఇదేవిధమున పునః పునః అడిగిన ప్రశ్నలకు సవిత అంటే వాయువు, యజ్ఞము, మేఘము, సూర్యుడు, చంద్రుడు, మనస్సు, పురుషుడు అని సావిత్రి అంటే ఆకాశము, ఛందస్సు, విద్యుల్లోకము, నక్షత్ర ములు, వాణి, స్త్రీ అని జవాబులు చెప్పబడినవి. గోపథ బ్రాహ్మ ణమున 'చన్ద్రమా సవితా ప్రాణ ఏవం సవితా విద్యుదేవ' అని, సవితను చంద్రుడు, ప్రాణము మరియు విద్యుత్తుగా చెప్పబడెను. వీటన్నింటివలన 'సవితా' శబ్దమును అనేక దేవతలకని ప్రయో గించుటయే ప్రశస్తమైనదని తెలియుచున్నది.

ఇదే సవితా దేవతను శతపథ బ్రాహ్మణము - 'అసౌ వై దేవః సవితేతి' అని సవిత అంటే బ్రహ్మ అని అర్థము చెప్పెను.

శౌనకుల అభిప్రాయానుసారముగనూ - 'ఆదిత్యే మండలే ధ్యాయయేత్యర మాత్మనమ్ అయమ్' - ఆదిత్య మండలమున సూర్యుని రూపమున ఉన్నది ఆ పరమాత్మయే. ఆయననే ధ్యానించవలెను - అని, శ్వేతాశ్వతర ఉపనిషత్తు కూడ ఇటువంటి అభిప్రాయమునే వెల్లడించుచున్నది.

'తదక్షరం తత్సవితుర్వరేణ్యం ప్రజా చ తస్మాత్ ప్రసూతా పురాణే'।

అనగా ఆ సమయమున కేవలం అవినాశియైన ఈ దైవమగు సవితయే వరణీయమై ఉండెను. ఈయన నుండియే ప్రాచీన జ్ఞానము ప్రసరితమాయెను. - అని.

మహర్షి దయానందులు సవితాశబ్దమును వ్యాఖ్యానించుచూ పంచమహాయజ్ఞ విధిలో ఇట్లు చెప్పారు—

సువోతి సూయతే సువతి వోత్పాదయతి సృజతి సకల జగద్ స సర్వపితా మహేశ్వరః సవితా పరమాత్మా తస్య సవితుః పసవే।

— ఈ పూర్ణ విశ్వమును ఉత్పత్తి చేయు సవితయే సర్వులకు తండ్రి, దైవము, పరమ పిత అయి ఉన్నాడు.

సూర్యోపనిషత్తున వాయువు ఆదిగా గల వాటన్నింటి ఉత్పత్తికి సూర్యుడే కారణమని అంగీకరించుచూ ఇట్లున్నది—

ఆదిత్యాద్వాయుర్జాయతే ఆదిత్యాత్ భూమిర్జాయతే, ఆదిత్యా దాపో జాయన్తే, ఆదిత్యాజ్జ్యోతిర్జాయతే, ఆదిత్యాద్ వ్యోమదిశో

జాయన్తే । ఆదిత్యాద్దేవా జాయన్తే, ఆదిత్యాద్వేదా జాయన్తే ।
ఆదిత్యో వా ఏష ఏతన్మండల తపతి అసావాదిత్యో బ్రహ్మ ।

— ఆదిత్యునినుండి వాయువు, భూమి, జలము, జ్యోతి, ఆకాశము, దిశలు, దేవతలు, వేదములు ఉత్పన్నమైనవి. బ్రహ్మాండమునకు ఉష్ణము నిచ్చుచున్న ఏ ఆదిత్యుడు కలడో ఆతడే బ్రహ్మము.

సూర్యోపనిషత్తున సూర్యుని స్తుతించుచూ ఇట్లు చెప్ప బడినది—

'సవితా పురస్తాత్ సవితా పశ్చాత్తాత్ సవితో త్తరాత్తాత్ సవితాऽధరాత్తాత్। సవితా నః సువతు సర్వతాతిం సవితా నో రాసతాం దీర్ఘమాయుః।

— మన ఎదుట, వెనుక, ఇటు - అటు, ధరిత్రి. ఆకాశాదులందున సర్వత్ర సవితాదైవము విద్యమానుడై ఉన్నాడు. ఆ సవితాదైవము మనకు అవసరమగు సర్వమును ఉత్పన్నము చేయుగాత. మనలను దీర్ఘజీవులను చేయుగాత.

సూర్యుడు మరియు బ్రహ్మ ఈ ఇరువురనే ఇట్లు యాచించుట జరుగును, కనుక సవితా శబ్దము వీరిరువురకు (సూర్యుడు, బ్రహ్మ) ఉభయవాచకమై ఉండుటయేగాక సూర్యుడు, సవితా, బ్రహ్మ సమానర్థములు గల శబ్దములని రుజువగుచున్నది.

# సవితా సావిత్రులయొక్క అనన్యాన్యాశ్రిత సంబంధము

సవితా, సావిత్రులకు పరస్పరమగు అనన్య సంబంధము కలదు. ఈ విషయమునే తెలియజేయుచూ వాల్మీకి రామాయణ మున సవితా విద్యను బలా, అతిబలా అను ద్వివిధ నామములతో శక్తిభరితములైన రెండు విద్యలను గూర్చి చెప్పబడినది. మహర్షి విశ్వామిత్రుడు తన యజ్ఞ సంరక్షణార్థమై శ్రీరామ లక్ష్మణులను తనకు తోడుగా పంపవలసినదని దశరథుని కోరి వారిని వెంట తెచ్చి నప్పుడు ఆయన వారికి ఈ విద్యలను నేర్పెను. మహర్షి విశ్వామిత్రులు సావిత్రికి ఋషియైనందున తత్సంబంధిత విద్యలందు శ్రేష్ఠమైన ఉపదేష్టగా ఉండిరి. ఎందుకనగా ఆయన కఠిన తపశ్చర్య ద్వారా అభూతపూర్వమైన సామర్థ్యమును పొందిరి. తాను తలంచినదంతటిని చేయగల సామర్థ్యము కలవారై, సవితాశక్తిని తనలో కేంద్రీకరించుకొని ఉండిరి.

మహర్షి విశ్వామిత్రులు శ్రీరామ లక్ష్మణులకు బలా-అతి బలా విద్యలను ఉపదేశించిన తరువాత వాటి ఫలములను గూర్చి తెలియజేయుచూ యిట్లనిరి.—వీటి ప్రభావమున మీ కెన్నటికిని శ్రమ తోచదు. జ్వరాది రోగములును బాధింపవు. మీ రూప మునం దెన్నడును ఎటువంటి వికృతి కలుగదు. ఒకవేళ మీరు నిద్రావస్థలో ఉన్ననూ లేక అసావధాన స్థితియందున్నను రాక్షసులు మీ మీద ఆక్రమణ జరుపలేరు. అద్వితీయమైన మీ బాహుబలమును

ఎదిరించగల సామర్థ్యము కలవారంటూ ఎవ్వరును ఉండరు. ముల్లోకములందు ఎవ్వరును మీ ఎదుట నిలువజాలరు. మీరు జ్ఞానము, బుద్ధి, దక్షత, సౌభాగ్యములందు అద్వితీయులై ఉండెదరు. ఈ రెండు విద్యలు సర్వవిధ జ్ఞానమునకు జనని వంటివి. వీటివలన ఆకలి దప్పులను జయించనగును. మీరు సంపూర్ణ విశ్వమును సంరక్షించగల సమర్థులై వర్ధిల్లెదరు.

సావిత్రీ ఉపనిషత్తునందు దీని ధ్యానమును గూర్చి ఇట్లున్నది —

శ్లో॥ అమృతకరతలాగ్రౌ సర్వసంజీవనాథయా -
వఘాహరణ సుదక్షౌ వేదసారే మయూఖే।
ప్రాణవమయవికాశా భాస్కరాకారదేహౌ -
సతతమనుభవేఽహం తౌ బలాతిబలాన్తౌ ॥

సూర్యునివంటి ప్రకాశవంతమగు శరీరము కలిగి, ప్రణవ స్వరూపము రశ్మివంతమునై, వేదముల సారరూపమై, పాపములను నశింపజేయు దక్షత కలిగి, సర్వవిధ సంజీవనీ శక్త్యాధిష్ఠితమై అమృతముతో పరిపూర్ణమైన హస్తములు గల ఆ బలా - అతిబలా విద్యాదేవతను నేను సర్వవేళలా అనుభవము పొందుచున్నాను.

సవితా సంబంధమగు బలా - అతిబలా మంత్రములుకూడ గాయత్రీ యందున్నవి. సావిత్ర్యుపనిషత్తునందు అది ఈ దిగువ విధమున వర్ణితమైనది—

ఓం హ్రీం బలే మహాదేవి హ్రీం మహాబలే క్లీం చతుర్ధి పురుషార్థ సిద్ధప్రదే తత్సవితుర్వరదాత్మికే హ్రీం వరేణ్యం భర్గో దేవస్య వరదాత్మికే అతిబలే సర్వచ్ఛృష మోహనాశనీ ధీమహి ధియోయోనర్జాతే యాచ ప్రచోదయాత్మికే ప్రణవ శిరస్కాత్మికే హుంఫట్ స్వాహాః।

ఇట్లు బలా - అతిబలా విద్యాసంబంధమగు సాధన చేయు సాధకుడు సావిత్రీ - (గాయత్రీ) దేవియొక్క సాలోక్యము పొందుచున్నాడు. దీనిలో సవితా, సావిత్రీల సంయుక్తశక్తి నిహితమై ఉన్న కారణమున ప్రభావము అత్యంత మహనీయమై ఉన్నది. దీనినుండి ఉత్పన్నమగు శక్తినిగూర్చి ఆధునిక వైజ్ఞానికులు (సైంటిస్టులు) గూడ పరిశోధనలు కొనసాగించుచున్నారు. వారు చేయుచున్న పరిశోధనలు ఇవి—

గాయత్రీ మంత్రోచ్చారణవలన ఈథరునందు ఉత్పన్నమగు కంపనలకు, సూర్యునకు ఎట్టి సంబంధము ఉండవచ్చును? గాయత్రీమంత్రమునందలి 'సవితు' శబ్దధ్వనితో సూర్యుని స్థూల శక్తిని ఏ మేరకు ఆకర్షింపనగును? - అని.

సవితావిషయకమగు వైజ్ఞానిక (సైంటిఫిక్) నిరూపణములు :—

వైజ్ఞానికులు అందరును కనీసం ఈ విషయమును అంగీకరించుచున్నవారే—మనుష్యుని మస్తిష్కము వరకు బుద్ధియొక్క ఉద్గమస్థానం ప్రకృతియొక్క సామూహిక మస్తిష్కము అథవా మనస్సునందు సన్నిహితమై ఉన్నది. దానినుండి ఎలక్ట్రానుల

రూపమున శక్తి లభించుచున్నది. కనుక గాయత్రీ మంత్రము ద్వారా 'సవితుః' శబ్దముతో ఎవరిని ఉపాసించుట జరుగుచున్నదో అది సూర్యునితో సంబంధము కలిగి ఉన్నది. అంతేగాక సూర్యునికి, బ్రహ్మకు భిన్నత్వములేక అభిన్నులుగా ఉన్నారు.

వాల్మీకిరామాయణమున భగవాన్ శ్రీరామచంద్రులద్వారా సూర్యస్తుతి ఉల్లేఖితము. అందు కో సూర్యునికిగల ఏ సామర్థ్యమును స్తుతించుట జరిగినదో అది అవలోకనీయమై ఉన్నది—

శ్లో॥ 'రశ్మివన్తం సముద్యన్తం దేవాసుర నమస్కృతమ్ ।
పూజయస్వ వివస్వన్తం భాస్కరం భువనేశ్వరమ్ ॥

—కిరణసమన్వితుడై, దేవతలు, దైత్యులచే నమస్కృతుడైన ఆ లోకాధిపతియగు వివస్వంతుడగు భాస్కరుని పూజించుచున్నారు.

దీనివలన సూర్యుని సామర్థ్యము అద్వితీయమని విదితమగుచున్నది. దేవ, దానవ, మానవాదులుగాగల అన్యోన్య చరాచర ప్రాణులన్నియు ఆయనకు నమస్కరించుచున్నవి. ఈ విధమున గాయత్రీ మంత్రమున గల 'సవితుః' శబ్దము సర్వాభీష్టములను తీర్చునదేగాక సిద్ధులను చేకూర్చగల సంపూర్ణ అభీష్టములను తీర్చగలిగిన సామర్థ్యవంతమై ఉన్నది.

— * —

# వరేణ్యముతో సర్వప్రాప్తి

## వరేణ్యము - బ్రహ్మము

గాయత్రీ మంత్రమునందలి 'వరేణ్యమ్' అభూతపూర్వమైన మహాత్మ్యము కలిగిఉన్నది. దీనిద్వారా సంపూర్ణవిశ్వోత్పత్తి, స్థితి లయ కారకుడు, దుఃఖనాశనకర్త, సుఖప్రదాత అయిన బ్రహ్మ సంకేతమును తెలుపుచున్నది. దీనివలన సాధకుడు బ్రహ్మయొక్క అద్వితీయ కృపాప్రాప్తికి అధికారియై సర్వసమర్థవంతుడగును. అగ్ని పురాణాభిప్రాయానుసారం—

శ్లో॥ 'వరేణ్యం సర్వతేజేభ్యో శ్రేష్ఠం వై పరమం పదమ్।
సర్గాపవర్గకామర్వా పరణీయం సదైవ హి'॥

— ఏదైతే సర్వతేజో సంపన్నము శ్రేష్ఠమగు పరమ పదమై ఉన్నదో అట్టి స్వర్గ-మోక్షములను కోరువారికి గ్రహణ (స్వీకరణ) యోగ్యమై ఉన్నది. కనుక వారు సర్వదా ఈ 'వరణ' మును ప్రార్థించుచున్నారు.

ఇందువల్ల ఆ తేజస్సు ధ్యానయోగ్యమై ఉన్నదని అగస్త్య మహర్షి ఇట్లభిప్రాయపడుచున్నారు—

శ్లో॥ అంతర్గతం మహద్వర్చో వరణీయం యతాత్మభిః।
ధ్యాయేత్తన్పరం సత్యం సర్వవ్యాపీ సనాతనమ్'॥

— దాని అంతర్గతమునందలి మహాతేజస్వి. పూజనీ యోగ్యుడునగు మర్త్యస్వరూపుడు, సర్వవ్యాపకుడునగు ఏ పురుషుడైతే రాజిల్లుచున్నాడో ఆయనను ధ్యానించవలెను.

మహర్షి యాజ్ఞవల్క్యుడు తన గాయత్రీభాష్యమున ప్రాపంచిక భయములకు నిత్యము భీతిల్లుచున్న ముముక్షువులకు కూడ ఉపాసనాయోగ్యమైనదనుచు ఇట్లనుచున్నారు—

శ్లో॥ వరణీయ్చ యో నిత్య సంసారభయభీతః ।
ఆదిత్యాన్తర్గతం యచ్చభర్గాఖ్యం వై ముముక్షుభిః ॥

—ప్రాపంచిక భీతికి భీతిల్లి మరియు మోక్షకాములై ఉన్న సాధకులు సూర్యమండలాంతర్గతమునగల 'భర్గ' అను పేరుగల తేజస్సును ధ్యానించుట యోగ్యమై ఉన్నది.

'వరేణ్య' శబ్దవిషయమునుగూర్చి ఆయా ఆచార్యులు తెలియజేసిన అభిప్రాయములను తెలుసుకొనుటద్వారా వస్తువిషయమై బాగుగా గ్రహించుటకు ఉపకారి కాగలదు—

శ్లో॥ వృణుతేవరణార్థత్వా జ్జాగ్రత్స్వప్నాదివర్జితమ్।
న్త్యిం శుద్ధ బుద్ధమేక సత్యం తద్వీమహీశ్వరమ్ ॥

(అగ్నిపురాణము)

పూజనీయమైనది అనే అర్థమున ఉండుటవలన జాగ్రత్త, స్వప్నాదిరహితమై నిత్యము, శుద్ధము మరియు ఏకైక సత్య స్వరూపమున ఉన్న ఆ మహనీయుడైన ఈశ్వరుని ఉపాసించుచున్నాను.

శ్లో॥ దీప్తస్య సర్వజంతూనాం ప్రత్యక్షస్య స్వభావతః ।
సవితుః సాత్మభువస్తు వరేణ్యం సర్వం జన్తుభిః ॥

— సర్వప్రాణులందు ప్రత్యగాత్మ రూపమున మరియు స్వాభావికముగా ప్రకాశించుచున్న సవితా దేవుని పూజనీయమైన తేజస్సు అందరును ధ్యానించుటకు యోగ్యమై ఉన్నది.

శ్లో॥ వరేణ్య వరణీయత్వాద్ సేవనీయతయా తథా ।
భజనీయతయా సర్వేః ప్రార్థనేయతయా స్మృతమ్ ॥
(ప్రపంచసార తంత్రము)

— పూజనీయమై ఉన్నందున వరేణ్యము ఉపాసనా యోగ్యమై, భజింపయోగ్యమునై సర్వప్రాణులచేత ప్రార్థింప తగియున్నది.

శ్లో॥ 'వరేణ్యమాశ్రయణోయం దాధారమిదజగత్ ।
భర్గః స్వసాక్షిత్కారేణాయిద్యా తత్కార్యం దాహకమ్' ॥

— ఏదైతే ఈ విశ్వమునకు ఆధారము మరియు ఆశ్రయ స్థానమై ఉన్నదో ఆ భర్గ తన సాక్షాత్కారముతో అవిద్యాజనిత కార్యములను నశింపజేయును.

శ్లో॥ వరేణ్యం వరణీయశ్చ సంసార భయభీరుభిః ।
ఆదిత్యాన్తర్గతం యచ్చ భర్గాఖ్యం వా ముముక్షిభి
యో యాః ॥

— ప్రాపంచిక భయమునకు భీతావహులై యున్న ముముక్షువులకు సూర్యమండలమునగల 'భర్గ' తేజస్సే పూజనీయమై ఉన్నది.

'వరేణ్య వృఙ్ ప్రమ్భక్తౌ ఏణ ప్రత్యయః సర్వేషాం సమ్భజనీయమ్.'।

— వరదరాజ్

— ఏణ్య ప్రత్యయము చేరుటవలన 'వృఙ్' ధాతువు చేకూరును. అందరకు ఆరాధ్యనీయమైనందున భజనీయమై ఉన్నది.

శ్లో॥ 'దీవ్యతీతి దేవః పరమాత్మా తస్య వరేణ్యం।
సర్వైర్భజనీయం వృఞ ఏణ్యః' ॥

— భట్టోజీ దీక్షిత్

— ఆయన ప్రకాశమును ప్రధానం చేయుచున్నందున దేవత, పరమాత్మయును ఆతడే ఆయి ఉన్నాడు. ఆయనను పూజింపవలెనను అర్థంలో 'వృఞ' ధాతువునకు 'ఏణ్య' ప్రత్యయమును చేకూర్చుటలో 'వరేణ్య' మగుచున్నది.

'వరేణ్యం వరణీయం ప్రార్థనీయం నియమాదిభిరపగత కల్మషైః సతతం ధ్యేయమ్।

(భారద్వాజ- గా. భా.)

— 'వరేణ్యం' అనగా వరణీయము (పూజాయోగ్యమైనది) ప్రార్థనీయమైనది (ప్రార్థించదగినది) అని. ఎవని పాపములన్నియును నియమారుల పాలనచే నశించిపోయినవో అట్టివారు ధ్యానించుటకు యోగ్యమైనది.

'వ రేణ్యం వ సేణ్యమిత్యన్నాం వరేణి యమన్నమేవ ప్రజాపతిః'।

(బ్రహ్మపురాణము)

—వరణయోగ్యమైన అన్నముఅనే అర్థమున వరణీయము మరియు ఆయనే ప్రజాపతి అయి ఉన్నాడు.

సర్వ వరేణీయం నిరతిశయానన్ద రూపమ్।

(శంకరభాష్యము)

—అదే సర్వులకు వరణీయము, పరమానంద స్వరూపము (బ్రహ్మము) నై ఉన్నది.

'ప్రధానే ప్రార్థనీయే చ యవద్ధరంవర్ణ్యతు అహం అతి శ్రేష్ఠం తద్వరేణ్యమ్'।

(సాయన భాష్యము)

—వరణీయము ప్రార్థయనీయ అయిన కారణమున జనన-మరణాదిగాగల దుఃఖములనుండి విడిపించునది మరియు ధ్యాసించుటద్వారా ఉపాసనాయోగ్యమైనదిగా ఉన్నది.

పైన జెప్పిన అభిప్రాయములు, ఉదాహరణములద్వారా 'వరేణ్యం' శబ్దాభిప్రాయం పూజనీయమైనదని, పూర్తిగా తనకు హితమైనదే పూజింపబడునని, ఏదైతే తనకు సంపూర్ణమగు ఐశ్వర్యములను, శుభములను, సుఖములను ఇవ్వగలుగుటయేగాక మంగళప్రదమగు జ్ఞానమును ఇవ్వగలదో అదే 'వరేణ్యం' అని తెలియుచున్నది.

లేక ఉపాసన చేయుటకు తగినదికూడ వరణీయమైనదే కాగలదు. వరణము అనగా గ్రహించుట, తనకు అనుకూలముగా జేసికొనుట లేక ప్రభావితము చేయుట అని కూడ కలదు. అథవా

ఉపాసనార్హమైనదికూడ వరణీయమైనదే అను అర్థం కలదు. భక్తి భావముతో పూజింపబడునదికూడ వరణీయము, భజనీయమైనదే. దేనినైతే పూర్తిగా ఆశ్రయించి, దేనిమీదనైతే ఆధారపడి, దేని ఆధారమున మనగలుగుట కొనసాగుచున్నదో అదియును వరణీయ మైనదై ఉన్నది.

ఇటువంటి సర్వసామర్థ్యములన్నియును ఒక్క పర బ్రహ్మమునకే కలవు. అన్యులెవ్వరికి ఉండగలవు! ఆయనను గూర్చిన భక్తి, జ్ఞానము, ఉపాసన, ధ్యానము మొదలగునవి ఆచర ణీయములు. ఆయన గుణగణములను గానము చేయుట, కీర్తిం చుట ప్రాణిమాత్రులకు శ్రేయస్కరములు. ఆయన సంబంధమగు పూజ, పఠనము చేయుట, జప-తప-ధ్యానాదులను సల్పుట ఆచర ణీయములు. ఆయనను ప్రార్థించుటవలన లౌకిక సుఖములు, పార మార్థిక మోక్షము రెండును ప్రాప్తించగలవు.

## గాయత్రీ రహస్యోపనిషత్తు

'వరేణ్యమ్' శబ్దమును ప్రజాపతివాచకముగా నుడివెను. (వరేణ్యమిత్యత్ర ప్రజాపతిః) ప్రజాపతి ఎవరు ? అనే అనుమాన కలుగవచ్చును. ఇటువంటి అనుమానమునకు సమాధానం 'శ్వేతా శ్వతరోపనిషత్తు' నందలి దిగువ వచనములతో సహజముగా ఉన్నది—

శ్లో॥ యేనావృతం నిత్యమిదం హి సర్వే
జ్ఞః కాలాకాలో గుణో సర్వవిఘ్నః ।
తేనశిత కర్మ వివర్తతే హి
పృథ్వ్యప్తేజోఽనిలఖాని చిన్త్యమ్ ॥

—— ఈ సమస్త విశ్వమంతయు ఏ పరమాత్మచే వ్యాప్తమై ఉన్నదో అట్టి పరమాత్మ కాలమునకే కాలము (కాలునకే కాలుడు) సర్వము తెలిసినవాడు, సర్వగుణసంపన్నుడై ఉన్నాడు. విశ్వరూప మును ధరించుచున్న కార్యములన్నియు ఆయన చేసిన వ్యవస్థ వల్లనే నడచుచున్నవి. పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశం (పంచతత్వములన్నియు) అన్నియును ఆయన వలననే నియమా నుసారముగా ఉంటున్నవి.

—— * ——

మం॥ ఘోషిణీ ప్రథమామాత్రా విద్యున్మాత్రా తథాపరా ।
పతంగినీ తృతీయాస్యా చ్చతుర్థీ వాయువేగినీ ॥
పంచమీ నామధేయాతు షష్ఠీ చైన్ద్ర్యభిధీయతే ।
సప్తమీ వైష్ణవీనామ అష్టమీ శాంకరీతి చ ॥
నవమీ మహతీనామ ధృతిస్తు దశమీ మతా ।
ఏకాదశీ భవేన్నారీ బ్రాహ్మీతు ద్వాదశీ పరా ॥

తా॥ ప్రణవముయొక్క ద్వాదశ మాత్రలు (పంద్రెండు మాత్రలు వివరింపబడుచున్నవి.

1) ఘోషిణీ, 2) విద్యున్మాత్ర, 3) పతంగిని, 4) వాయు వేగిని, 5) నామధేయ, 6) చైంద్రి, 7) వైష్ణవి, 8) శాంకరి, 9) మహతి, 10) ధృతి, 11) నారి, 12) బ్రాహ్మి.



# గాయత్రీ మంత్రార్థ వివరణము



"గాయతం త్రాయతే యస్మా ద్గాయత్రీ తేన కథ్యతే" గానము చేయువానిని, అనగా మననము చేయువానిని రక్షించునది గావున గాయత్రి యనఁబడును.

ఈ మంత్రము ద్విజుల కుపనయనకాలమందు గురువులచే నుపదేశింపఁ బడుటచే దీనికి గురుమంత్ర మనియు, బ్రహ్మోపదేశ మనియు, పేర్లు కలవు. గాయత్రీమంత్రము వేదత్రయమందును గలదు. ఈ మంత్ర మేదో యొకానొక దేవతావిశేషముయొక్క యుపాసననుగాని, ఏదోయొక సాంప్రదాయమునకు సంబంధించి నట్టియు, లేక నికృష్టమగు భోగములను గోరునట్టియుఁ బ్రార్థనను గాని ప్రతిపాదింపక కేవల మా పరమేశ్వరుని గూర్చినట్టియు సార్వభౌమికమైనట్టియుఁ బ్రార్థనను, లేక యుపాసననే ప్రతిపాదించును.

జగద్భాసకమైన యీ దివ్యశక్తిని సర్వధర్మస్వరూపమైన వేదము (వేదోధర్మ మూలం) "గాయత్రీ వేదమాతా" అనియు "న గాయత్ర్యాః పరం మంత్రం" అనియు ప్రవచించి "అహరహస్సంధ్యాముపాసీత" యని యపూర్వ విధిచే గాయత్రీ సంధ్యోపాసనా విధిని శాసించుచున్నది.

ఓమ్ భూర్భువ స్సువః॰ తత్సవితుర్వ రేణ్యమ్

భర్గో దేవస్య ధీ మహి ధియోయోనః ప్రచోదయాత్

(ఇందు "ఓ ౩ మ్" అనునది ప్రణవము. ప్రతి వేదమంత్ర మునకును ముందును చివరను దీని నుచ్చరింపవలెనని ఋషుల మతము. "భూర్భువస్స్వః" (భూః, భువః, స్వః) అను నీ మూడును మహావ్యాహృతులు. చతుర్వింశత్యక్షరాత్మకం బగు "తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్" అనునది అసలు గాయత్రీమంత్రము (Gayatri Proper). గాయత్రీ మంత్రము. ఎనిమిదేసి అక్షరములతోఁ

---

* దక్షిణదేశమందు "సువః" అని వ్యవహరింతురు.

"తథ్స...." అని కొన్ని మైసూరు వేద ప్రతులయందు గలదు. "ప్రథమోఽష్మపరే ద్వితీయః ॥" పాణిని. ప్రథమకు ('త'కు) ఊష్మము (స) పరమైనపుడు ద్వితీయము ('థ') అగునని కొందఱిమతము.

*దక్షిణదేశపు సాంప్రదాయానుసారముగ "రే" "యా" లపై దీర్ఘ స్వరిత మున్నది.

గూర్చుకొనిన మూడుపాదములు కలది. ఇందు మొదటిపాదమునం దేడక్షరములు మాత్రమే యున్నవి. అందులకుగాను "వరేణ్యం" అను పదమును సామవేదమునందువలె "వరేణియం" అని విడదీసి గాని, "ఓం" కారమును కలిపిగాని, ఎనిమిదక్షరములుగ లెక్కించుచున్నారు. ("ఇయాది పూరణః" అని పింగళఛందమునందున్నది.)

గాయత్రీ మంత్రమునకు "విశ్వామిత్రుడు" ఋషి, అనగా, మంత్రద్రష్ట— ఈ మంత్రమును, మంత్రార్థమును దెలిసికొని విస్తరించి ప్రచారముచేసినవాడు. "సవితా" దేవత, అనగా ప్రతిపాద్యవిషయము సృష్టికర్తయగు పరమేశ్వరుడు. "(నిచృద్) గాయత్రి" ఛందస్సు, స్వరము "షడ్జమము".

గాయత్రీమంత్రము శుక్లయజుర్వేదమున నాలుగు సార్లును, కృష్ణయజుర్వేదమున రెండుసార్లును, ఋగ్వేదమున నొకసారియు, సామవేదమున నొకసారియు వచ్చినది. కాని శుక్లయజుర్వేదమున 36. 3లో వ్యాహృతియుతముగనున్నది. అక్కడమాత్రము సర్వము "మధ్యమము", తక్కినచోట్ల స్వరము "షడ్జమము".

— o —

# మహావ్యాహృతులు

(1) "వ్యాహరణం-ఉచ్చారణం, తద్విషయత్వాన్మంత్రాణాం వ్యాహృతిత్వమ్". (2) (యద్వా) "వివిధే - కర్మణి,

ఆహ్రియంతే-ప్రయుజ్యంత ఇతి-వ్యాహృతయః" వివిధములగు కర్మలయందు ప్రయోగింపబడునవి గావున వ్యాహృతులు.

"భూః" అనుదానికి భూలోకము, అగ్నిదేవత, ఋగ్వేదము, ప్రాణవాయువును; "భువః" అనుదానికి అంతరిక్ష లోకము, వాయుదేవత, సామవేదము, అపానవాయువును; "సువః-స్వః" అనుదానికి స్వర్లోకము, ఆదిత్యదేవత, యజుర్వేదము, వ్యాన వాయువును అను నర్థములు వివక్షితము లని తైత్తిరీయోపనిషత్తు యొక్క మతము.

భూః = ["భూరితివై ప్రాణః భువ రిత్యపానః స్వరిత వ్యానః ॥" తై. ఉ శి. -5 "యః ప్రాణయతి చరాచరం జగత్ స భూః, స్వయంభూ రీశ్వరః ప్రాణాదపి ప్రియస్వ రూపో వా సచేశ్వరః"] సమస్తజగత్తునకు జీవనాధారుఁడును, స్వతస్సిద్ధుఁడును ప్రాణమునకంటెఁగూడ ప్రియుఁడును; భూలోకాధిపతియు; కర్మకాండోపదేష్టయు; సత్స్వరూపుఁడునునగు పరమేశ్వరుఁడు (One Who is the life and support of the whole universe, is dearer than life itself, and is self-existent; All-life)

భువః = ["భువరిత్యపానః", "యః సర్వం. దుఃఖ మపానయతి దూరీకరోతి సోఽపానః"] సమస్తదుఃఖములనుండియు రహితుఁడును. నిజభక్తులను సమస్తదుఃఖములనుండి తొలగించి సర్వదా సుఖమం దుంచువాఁడును;

భువర్లోకాధిపతియు, ఉపాసనాకాండోప దేష్టయు; చిత్స్వ రూపుఁడునునగు పరమాత్మ (One who is himself free from all tribulations, who destroys all tribulations, and gives bliss to His devotees All-holiness).

స్వః = ["స్వరితి వ్యానః" యో వివిధం జగత్ వ్యానయతి వ్యాప్నోతి వ్యానః సర్వాధిష్ఠానం సుఖస్వరూపం బ్రహ్మేతి స్వః] నానావిధమగు జగత్తంతయు వ్యాపించి యున్నవాఁడును, సర్వాధిష్ఠాతయు, సుఖస్వరూపుఁడును; స్వర్లోకాధిపతియు; జ్ఞానకాండోపదేష్టయు; ఆనందస్వరూపుఁడునునగు పరబ్రహ్మము (One Who pervades this multiform universe and is the support of all and who is the personification of bliss; all-bliss).

— o —

# గాయత్రీమంత్రార్థము

సవితుః = ["యః సునో త్యుత్పాదయతి సర్వంజగత్ స సవితా, తస్య"] సమస్తజగత్తును ఉత్పన్నముచేయు వాఁడును, అనగా, సర్వస్రష్టయు, సర్వైశ్వర్యయుక్తుడును, సర్వైశ్వర్యప్రదాతయు (of One who is the creator of the whole universe, Lord, and giver of all power and plenty)

దేవస్య = ["యో దివ్యతీ దీవ్యతే వా యః ప్రకాశయతి వా సదేవః తస్య"] స్వయం ప్రకాశస్వరూపుఁడును, అందరి ఆత్మలను

ప్రకాశింపఁజేయువాఁడును, సర్వ సుఖములనిచ్చువాడును, అందరిచేఁ గామింపఁబడు వాఁడునునగు పరబ్రహ్మము యొక్క- (of One Who is self-illuminating, of one Who illumines the souls, and of One who bestows happiness on all and is sought after by the learned).

తత్ = ఆ (that)

వరేణ్యమ్ = ("యద్వరం వర్త మర్త్యా మతిశ్రేష్ఠం తద్వరేణ్యమ్") వరింపఁ దగినదియు, సర్వపూజనీయమును, భజనీయమును అందఱకుఁ బ్రార్థింపఁదగినదియు, పరమ పవిత్రమును, నిర్దుష్టమైనదియు, సర్వశ్రేష్ఠమునునగు (most adorable, all-holy)

భర్గః = ("భృజ్జంతి పాపాని దుఃఖమూలాని యేనతత్ తేజః శుద్ధం పరమార్థవిజ్ఞానస్వరూపం తద్భర్గః") పాపరూపక సర్వదుఃఖమూలమును నాశము చేయునట్టి, అనగా, సంసారమును నశింపఁజేయునట్టి తేజస్సును; అజ్ఞానాంధకారమును తొలగించునట్టితేజస్సును; శుద్ధ స్వరూపమును; విజ్ఞానస్వరూపమును (spiritual light and knowledge, destroyer of all sins and ignorance)

ధీమహి = (మేము) ధ్యానము చేయుచున్నాము; ఉపాసన చేయుచున్నాము; భావనచేయుచున్నాము; ధారణచేయుచున్నాము (we meditate or contemplate). ఎందునిమిత్తమనగా. (Because)

యః = పూర్వోక్తమైన యే (సవితృదేవ పరమాత్మయొక్క) తేజస్సు (which light and knowledge of the Almighty Lord)

నః = మాయొక్క (our)

ధియః = బుద్ధులను; ప్రజ్ఞలను (intellects or understandings) ప్రచోదయాత్ = (ఉత్తమ గుణకర్మస్వభావముల యందు) ప్రేరేపించుచున్నదో; ప్రవర్తింపఁజేయు చున్నదో; ప్రకాశింపఁజేయుచున్నదో (అట్టి తేజస్సును మేముధ్యానించుచున్నాము) (may actuate or illumine)

తాత్పర్యము:— (1) ఏపరబ్రహ్మముయొక్క సర్వోత్తమమైననామ మోంకారమో (సచ్చిదానందస్వరూపమో), ఎవ్వఁడు సమస్తజగత్తునకు జీవనాధారుఁడును స్వతస్సిద్ధుఁడును ప్రాణమునకంటెఁగూడ ప్రియుఁడును భూలోకాధిపతియు కర్మకాండోపదేష్టయు సత్స్వరూపుఁడునో, ఎవ్వఁడు సమస్తదుఃఖములనుండియు రహితుఁడును నిజభక్తులను సమస్తదుఃఖములనుండి తొలగించి సర్వదా సుఖములనొసంగువాఁడును భువర్లోకాధిపతియు ఉపాసనాకాండోపదేష్టయు చిత్స్వరూపుఁడునో, ఎవ్వడు నానావిధజగత్తునంతను వ్యాపించియున్న వాఁడును సర్వాధిష్ఠాతయు సుఖస్వరూపుఁడును స్వర్లోకాధిపతియు జ్ఞానకాండోపదేష్టయు ఆనందస్వరూపుఁడునో, ఎవ్వఁడు సమస్త జగత్తు నుత్పన్నముచేయు వాఁడును (సర్వస్రష్టయు) సర్వైశ్వ

ర్యయుక్తుఁడును సర్వైశ్వర్యప్రదాతయునో, ఎవ్వఁడు స్వయం ప్రకాశస్వరూపుఁడును అందఱియాత్మలను ప్రకాశింపజేయు వాఁడును సర్వసుఖములనిచ్చువాఁడును అందఱిచేఁ గామింపఁ బడువాఁడునో, అట్టిపరబ్రహ్మముయొక్క పరమపవిత్రమైన దియు సర్వపూజనీయమైనదియు భజనీయమైనదియు నిర్దుష్ట మైనదియు సర్వశ్రేష్ఠమైనదియు నగు పాపరూపకసర్వదుఃఖ మూలమును నాశముచేయునట్టి (సంసారమునునశింపుచేయునట్టి) తేజస్సును — అజ్ఞానాంధకారమును తొలగించునట్టి తేజస్సును, శుద్ధస్వరూపమును, విజ్ఞానస్వరూపమును — మేము ధ్యానము చేయుచున్నాము, లేక, ఉపాసించుచున్నాము. ఎందునిమిత్త మనగా పరమాత్మయొక్క ఆ తేజస్సు మాయొక్క బుద్ధులను ఉత్తమగుణ కర్మస్వభావములయందు ప్రేరేపించుటకు.

లేక, (2) ఓం ఓంకారపరబ్రహ్మ సచ్చిదానందస్వరూపుఁడును (భూః) సర్వజగజ్జీవనహేతువును ప్రాణమునకంటె ప్రియుఁ డును (భువః) సమస్తదుఃఖహర్తయు సుఖప్రదాతయు (స్వః) జగత్తంతయు వ్యాపించియున్న వాఁడును సుఖస్వరూపుఁడును నగు (యః) ఏపరమేశ్వరుఁడు (నః) మాయొక్క (ధియః) బుద్ధులను (ప్రచోదయాత్) (ఉత్తమగుణ కర్మస్వభావముల యందు) ప్రేరేపించుచున్నాఁడో, ప్రవర్తింపఁ జేయుచున్నాఁడో (అట్టి) (సవితుః) సమస్తజగత్తు నుత్పన్నము చేయువాఁడును సర్వైశ్వర్యయుక్తుఁడును సర్వైశ్వర్యప్రదాతయు (దేవస్య) స్వయంప్రకాశస్వరూపుఁడును అందరియాత్మలను ప్రకాశింపఁ

జేయువాఁడును సర్వసుఖములనిచ్చువాఁడును అందఱిచేఁగామింపఁబడువాఁడును నగు పరబ్రహ్మము యొక్క (తత్) ఆ (వరేణ్యమ్) పరమపవిత్రమైనదియు భజనీయమైనదియు సర్వశ్రేష్ఠమైనదియు నగు (భర్గః) పాపరూపకసర్వదుఃఖమూలమును (సంసారమును) నాశముచేయునట్టియు అజ్ఞానాంధకారమును తొలగించునట్టియు విజ్ఞానస్వరూపకమైన తేజస్సును – శుద్ధస్వరూపమును– (ధీమహి) మేముధ్యానము చేయుచున్నాము, లేక, ఉపాసించుచున్నాము.

లేక, సంక్షేపముగ (౩) (ఓం) ఓంకారపరబ్రహ్మ సచ్చిదానందస్వరూపుఁడును (భూః) సర్వజగజ్జీవన హేతువును (భువః) సమస్తదుఃఖహర్తయు (స్వః)సుఖస్వరూపుఁడును నగు (యః) ఏ పరమేశ్వరుఁడు (నః) మా యొక్క (ధియః) బుద్ధులను (ప్రచోదయాత్) ఉత్తమ గుణకర్మస్వభావముల యందు ప్రేరేపించుచున్నాఁడో (అట్టి) (సవితుః) సర్వస్రష్టయు (దేవస్య * స్వయంప్రకాశస్వరూపుఁడును నగుపరమాత్మ యొక్క (తత్) ఆ (వరేణ్యమ్) సర్వశ్రేష్ఠమైనట్టి (భర్గః) అజ్ఞానాంధకారనాశకతేజస్సును (ధీమహి) మేము ధ్యానము చేయుచున్నాము.

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

ఓం తత్సత్